





జయప్రద మూవీస్

# నాకూ స్వతంత్రం వచ్చింది

ఈస్ట్మన్ కలర్

నిర్మాత ఎం ప్రభాకరరెడ్డి స్క్రీన్‌ప్లే దర్శకత్వం లక్ష్మీదీపక్

కథ మాటలు గణేష్ పాత్రో సంగీతం సత్యం కెమెరా దేవరాజ్ నవయుగ విడుదల

Ramu Ra Arts

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 8–8–'75
రాక్షసనామ సం. శ్రావణమాస శు.పాడ్యమి
సంపుటము : 68 సంచిక : 47

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33–80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
[illegible]టి శ్రీప్రభు

కథలు :

# దుర్వాసనే ఎడబాటుకు కారణం...



## కాల్గేట్ పరస్పర అన్యోన్యతకు కీలకం






DC-G.50 TL

## కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. ఎంత చక్కని పెప్పర్ మింట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...
ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్టు కంటె కాల్గేట్‌నే కొంటారు!

## డాక్టర్ సలహాలు

వి. ఎస్. హౌరా.

నా వయస్సు 32 సం లు. ఒక సంవత్సరముగా నాకు ఎడమ భాగమంతా చాలా వీక్‌గా వుంటోంది అలా వున్నప్పుడు ఇంజక్షన్లు వాడినాను. కొన్ని రోజులు బాగుండి మరలా వస్తోంది. పాదము మొదలు నడుము,మెడ నరములు, తల పీకుతున్నట్లు నొప్పిగావుంటుంది.

ఈ లక్షణాలు వున్న వారు న్యూరోఫిజిషియన్ల సహాయంపొందటం అవసరం. ఈలోగా నెత్తురులో—వి. డి. ఆర్. ఎల్. షుగర్ యూరిక్ పరీక్షని మొదలయినవి చేయించుకొని వాటి ఫలితాలను వారికి చూపించితే మంచిది.

తరచు బ్లడ్‌ప్రెషర్ చూపించుకోవడం దానిని ఒక కాగితంలో తేదీల వారీగా గుర్తించుకోవటం మంచిది.

ఎమ్. వి. విజయవాడ.

మా అబ్బాయికి 4 సం. లు. వాడికి ప్రతి ఏడు సీతాకాలం మోకాలి క్రింద భాగం ఎగిరి పోతుంది. మందు రాస్తే పోతోంది. సీతాకాలం మరలా వస్తోంది.

సీతాకాలం చర్మం పగలటం సహజం ఏదో "అమ్మమ్మగారి" చిట్కా- వైద్యాలు — చాలా బాగా పని చేసేవి — పాటించక, అనవసరం ఉపయోగం లేని నా సంహా అడగటం ఏమిటి?

అన్ని రోగాలకు, కొన్ని ప్రకృతి సిద్ధమైన వాటికీ మన సాంప్రదాయపు పసరు, పట్టీలు, ఆకులు వేసి కట్టుకట్టడం వేసలీన్ పూయడంగాని ఆముదపు ఆకు కట్టు గాని కట్టడం — ప్రస్తుతం—'ఆంగ్లేయ" వైద్యం కన్నా చాలా గొప్పవి !! రక్తపు పోటుకి "సర్పగంధ" అనేమూలిక నుంచి — తయారు చేసి, "సెర్పాసిల్" లని ఆంగ్లేయ వైద్యం వాడటంలేదూ!

— డా॥ కె. వెంకటేశ్వరరావు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1975 'దీపావళి'కి ప్రత్యేకం!

## "చిన్న సీరియల్ కథ"ల పోటీ!

## మొత్తం రు. 5000 ల బహుమతులు

ఏటా నిర్వహిస్తున్న కథల పోటీ బదులు యీ ఏడు, రచయితల, పాఠకుల అభిరుచిని దృష్టిలో పెట్టుకుని "చిన్న సీరియల్ కథల" పోటీని నిర్వహిస్తున్నాము. సంపాదకుని ఎన్నికలో అత్యుత్తమంగా తేలిన **నాలుగు** సీరియల్ కదలను, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒకదాని తర్వాత ఒకటి వంతున వరుసగా వెలువరించి, వాటిపై పాఠకుల బ్యాలట్ తీసుకొని యెప్పటివలె అదనపు బహుమతులను కూడా విజేతలైన రచయితలకు అందించుతాము.

### *ముగింపు తేదీ మంగళవారం* 16—9—1975

*పోటీలో నెగ్గిన నాలుగు రచనలలో ఒక్కొక్క "చిన్నసీరియల్ కద"కి రు 800 లు చొప్పున పారితోషకం అందజేస్తాము.*

ఇదిగాక పాఠకుల 'బ్యాలట్'లో ప్రథమస్థానాన్ని పొందిన రచనకి రు 600లు, ద్వితీయ స్థానం, తృతీయ స్థానం పొందిన రచనలకు రు 500లు, రు 400లు చివరి కథకు రు (0)లు చొప్పున అదనపు బహుమతులు యిస్తాము.

నిబంధనలను గమనించి యీ పోటీలో లోగడకన్నా ఎక్కువమంది రచయితలు పాల్గొని ఈ కొత్త తరహా పోటీని జయప్రదం చేయగలరని అనుకుంటున్నాము.

★ చిన్న సీరియల్ కథ అంటే ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు వారాలు వేయటానికి సరిపోయే 'పెద్ద కథ' అనుకోవచ్చును.

★ కథ నిడివి **50** అరఠావులకి (పేజీకి 600 అక్షరాలు మించకుండా) దాటకూడదు. ఇతివృత్తం తెనుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై వుండాలి. తేట తెనుగు వ్యావహారిక భాషలోనే వ్రాయటం అవసరం

★ **కథ** అనువాదం, అనుసరణ కారాదు ప్రసార మైనా ప్రచురణ అయినా, లేదా యితర **ప**త్రికలకు పంపబడి పరిశీలనలో వున్న, కథలను పంపరాదు ఇతరులు వ్రాసిన కథలను వారిపేరులోనే అయినామరొకరు పంప కూడదు. హామీ పత్రం కథతోపాటు విధిగా వుండాలి దానిమీద రచన పేరు రచయిత చిరునామా కూడా విడి విడి అక్షరాలలో వుండాలి

★ రచనలపై వచ్చే పేచీలకు రచయితదే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ "1975 దీపావళి చిన్న సీరియల్ కథల పోటీ. సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520003 అన్న చిరునామాకి రచనలను పంపాలి పోటీలో పాల్గొన్న రచయితలు తమ 'కథ'తో పాటు స్వంత చిరునామా గల' తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన పెద్ద కవరును జతపరచాలి. పోటీలో ఎన్నిక కాని రచనలను వీలువెంబడి వారికి త్రిప్పి పంపడం జరుగుతుంది.

★ రచనలన్నీ మా కార్యాలయానికి 16-9-75 మంగళవారం సాయంకాలానికి అందాలి. అటు తరువాత అందిన రచనలను పోటీకి పరిశీలించలేము. తపా ఆలస్యం కావటం, మార్గంలో పోవటం లాంటి యిబ్బందులకు సంపాదకుని బాధ్యత లేదు.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి. అలా యిష్టం లేనివారు కథల పోటీకి తమ రచనలు పంపకపోవటమే మంచిది.

★ ఎన్నికైన నాలుగు కథలలో మొదటిదాని ప్రచురణ 1975 దీపావళి సంచికలో ప్రారంభం కావచ్చు నాలుగు కథల ప్రచురణపూర్తి కాగానే లేదా 16 వారాల తర్వాత 'బ్యాలట్' పత్రం ద్వారా పాఠకుల తీర్పును తీసుకుంటాము. — సం.

పెద్దకథ

# లోకంపోకడ

వలివేటి నాగచంద్రావతి

[గత సంచిక తరువాయి]

వంతుకోసం తల్లిని అన్నగారింటికి తరిమితే నలుగురు పిల్లలున్న తన ఇంట ఒక్క ఘడియ సాగదనీ, తల్లి లేకపోతే లక్ష్మీకాంత ఏలుబడిలో ఆ ఇంటతనకు అడపాదడపా మడత కుడుములు ప్రాప్తిస్తాయనీ శేషయ్యకు బాగా తెలుసు.

అంచేత అన్నగారి మాటలకు మహా నొచ్చుకుంటున్నట్టు మొహంపెట్టి 'అదేవిటన్నయ్యా అమ్మ నీ ఇంటోవుంటే ఒకటీ నా ఇంటో వుంటే ఒకటీనా ? అలాగ ఎప్పుడూ అనుకోకు అయినా...నువ్వేమనుకోనంటే ఒక్కమాట! అమ్మకి మీ ఇంట్లో 'ఏం తోస్తుంది చెప్పు ... ఒంటరిగా బిక్కు బిక్కుమంటూ... మా ఇంట్లో అంటావా పిల్లాజెల్లా.. తెలియకుండానే పొద్దు గడిచిపోతుంది అదీగాక పెద్ద తనాన పడిందా ... ఏదో జిహ్వా చాపల్యం.. అదీ ఇదీ తినాలనుంటుంది. మా ఇంట్లో అయితే అన్నీ సమృద్ధిగా వుంటాయి. మనం ఇప్పుడు చూడాల్సింది వంతులుగాదు; ఆవిడ సుఖం. అమ్మని నాదగ్గరే వుంచుకుంటాలే నువ్వేం బాధపడకు'' అన్నాడు తన ఉదాత్తత ప్రకటించుకుంటూ.

మనస్సు చివుక్కుమన్నా, ''నిజమంతే గదా.'' అనుకుంటూ మౌనంగా వూరుకున్నాడు నాగయ్య

ఇదేమీ తెలియదు రంగమ్మకి. అంచేత కోడలి తృణీకారానికి పౌరుష మొస్తున్నా, రానురానూ ఓపిక వుడిగి ఇంటెడు చాకిరీ చెయ్యలేకపోతున్నా, పెద్దకొడుకు దగ్గరకు వెళ్లిపోవాలని ఎంతగా అనిపిస్తున్నా, శేషయ్య గుర్తుచేసిన పెద్దకొడుకు ఆర్థికస్థితి ఆమెను పగ్గంవేసి వెనుకంజ వేసేలా లాగేది.

''సాయంపేరిట వెళ్లి వాడికి అదనపు భారం అవనా' అనుకున్న రంగమ్మ తన అభిమానాన్ని ఎప్పటికప్పుడు అణగదొక్కుకుంటూ చిన్నకొడుకు ఇంట్లోనే వుండక తప్పింది కాదు

అలాగ ఆవిడ రెక్కలు బాగున్నన్నినాళ్లూ చాకిరీ చేయించుకోవటమే కాకుండా, మహా ఉదారుళ్లా అన్నగారికి భరోసా ఇచ్చిన శేషయ్య ఈరోజు '' అమ్మని తీసుకెళ్లమని '' ఏ మొహంతో అనగలడు ?

* * *

మూడురోజులు భారంగా గడిచాయి. జ్వరం దిగజారడం తప్ప రంగమ్మ స్థితిలో పెద్ద మార్పేమీ రాలేదు రోజూ ప్రొద్దుటా సాయంత్రమూ నాగయ్య తల్లిని చూచిపోతున్నాడు.

ఈ మూడురోజుల్లోనే తల్లికి అక్కడ జరుగుతున్న రాజభోగం అవగాహన మయిపోయిందతనికి.

మొదటిరోజు అతను వెళ్ళేసరికి తెల్లవారి పదిగంటలయింది. అప్పటికింకా తల్లిమొహం కడిగించి ఇంత ధారకం పోసిన వాళ్లులేరు. తమ్ముడు ఇంట్లోలేడు. మరదలు లక్ష్మీకాంత పీకమొయినా వంటపనిలో మునిగిపోయి పిలిస్తే కరిచే మూడ్‌లోవుంది.

ఇహానప్పుడు తానే చెయి చేసుకుని తల్లిమొహం కడిగేడు సంకోచిస్తూనే మరదల్ని కదిలించి సగ్గుజావ కాయించి తల్లికి తాగించి వెళ్లాడు.

మరునాడూ సరిగ్గా అదే తీరు. ఆవేళయితే శేషయ్యకూడా ఇంట్లోనే వున్నాడు. నీరసంగా వేలాడిపోతూ దైన్యం వెలిగక్కే చూపులు చూస్తున్న తల్లినిచూచి దీర్ఘంగా నిట్టూర్చాడు నాగయ్య. నేరస్తుడిలా తలవాల్చుకున్నాడు శేషయ్య.

ఆ తరవాత తర్తలడిపోతూ పెళ్ళాన్ని కేకేసి తల్లికి మొహం కడగమనీ, పాలు ఇవ్వమనీ, అధారిటీగా ఏదో పురమాయించబోయాడుగానీ మాజీమంత్రిగారి రికమండేషన్‌లా మొగుడిమాట ఏమాత్రం లక్ష్యం చెయ్యని లక్ష్మీకాంత ముందు ఆ ఆజ్ఞలు చెల్లుబాటు కాలేదు.

నిప్పు ముట్టించిన టపాకాయలా లక్ష్మీకాంత వంటఇంట్లోంచే ఖయ్యిమంది.



# నమ్మా నమ్మకపో!

### మంత్రగాండ్ర సభ!

బొగొటా అనే నగరంలో ఆగష్టు నెలలో ఒక అపూర్వమైన సభ జరుగుతుంది. ప్రపంచ ప్రఖ్యాతులైన మంత్రగాళ్లూ, మంత్రగత్తెలూ సుమారు 300మంది పాల్గొంటారు. చనిపోయినవారితో ఈ సభలో పాల్గొనే కొందరు మాట్లాడుతారనీ, నోవా, నీరో, కెన్నడీ సోదరులు—వీరి ఆత్మలను "రప్పించి" వారితో మాంత్రికులు మాట్లాడుతారనీ ప్రచారం జరుగుతోంది.

### ఆర్యభట!

ఆర్యభట ప్రయోగించిన రెండవ రోజునే — ఆ విజయోత్సాహం వల్లార కుండానే — రష్యన్లు సప్లై చేసిన విద్యుత్ ఘటాలు పాడయి, విద్యుత్ సరఫరా తగ్గిపోయి ఆర్యభట చేయవలసిన 3 ప్రయోగాలను రద్దు చేశారు. ఇలాంటి "చిన్న" లోపాలు అమెరికా ప్రయోగించిన నౌకలలోనే తప్పలేదని డైరక్టరు యు.ఆర్.రావుగారు అన్నారు.

### పాఠకుల రుచి!

ప్రపంచంలో అధికంగా అమ్ముడు పోయే పుస్తకం ఏది?

ఇంతవరకు డాక్టర్ స్పాక్ వ్రాసిన శిశు సంరక్షణ గురించిన పుస్తకం. కాని యిప్పుడు, "గినీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్." ఇది సంవత్సరానికి ఒకసారి 14 భాషల్లో వస్తోంది. ఒక సంవత్సర కాలంలో రికార్డు స్థాపించిన విషయాల గురించి దీనిలో ఉంటుంది.

ఉదా: 1. ప్రపంచ లాంగ్ జంప్ రికార్డు ఎంత? (8మీ. 90సెం.)

2. ప్రపంచంలో ఎత్తైన కట్టడం ఏది? (పోలెండ్‌లోని రేడియో స్తంభం).

ఇలాంటి విషయాలన్నీ ఈ పుస్తకంలో ఉంటాయి.

### డాబా టెన్నిస్

మన అత్యుత్తమ టెన్నిస్ ఆటగాడు విజయ్ అమృతరాజ్‌ను 4 సార్లు ఓడించిన 42 సం.ల తాత కెన్‌రోజ్ వాల్‌కి టెన్నిస్ అంటే ఎంత ప్రేమ అంటే ...

తను కొత్తగా కట్టుకున్న డాబా యింటిచుట్టూ స్థలం లేక, తన డాబా మీదనే టెన్నిస్‌కోర్టు ఏర్పాటు చేసుకున్నాడు. ప్రపంచం మొత్తంలో డాబామీద టెన్నిస్‌కోర్టు యిదొక్కటే.

— బి. శ్రీదేవి

## లోకం పోకడ

"ఏమిటా తరుముడూ...? కాస్త ఆలస్యమయితే ఆవిడగారి ప్రాణంమీదికేం ముంచుకు రాదుగానీ ఆగండి కొంచెం. నేనిక్కడ కాళ్ళర జాపుకు కూచుని లేను. ప్రొద్దుటనించీ కాళ్లిరగ దొక్కుకుంటున్నా ... కనిపించటం లేదూ? అంత రంచనుగా టైముకి మీ అమ్మగారి అవశిష్టాలు తీర్చటం నావల్లకాదు సుమండీ.

అంతాగలేకపోతే పనిమనిషినే పెట్టుకుంటారో మీరే ఆమెగార్ని సేవించి తరించుతారో మీ ఇష్టమిక." అంటూ తెగేసి చెప్పింది.

మరి నోరు పెగల్లేదు శేషయ్యకి.

నిట్టూరుస్తూ తల్లితో మొహం కడిగించడానికి ఉపక్రమిస్తున్న అన్నగారికి తనూ సాయంచేస్తూ, "కాంతకి... పిల్లల మూలాన్న ... పనీ ఎక్కువై... విసుగు. అంచేత..." నసుగుతూ భార్యని సమర్థించాడు శేషయ్య తమ్ముడివంక ఒక్కసారి ఉదాసీనంగా చూసి తల్లికి పాలు కొని తీసుకు రావటానికి బయటకు వెళ్లిపోయాడు నాగయ్య.

మూడోనాడు రంగమ్మ ఉన్నస్థితి ఎవరినైనా ద్రవింపచేసేదిగా వున్నది.

సైగచేద్దామంటే అవసరసమయానికి ఎవరూ కనబడనందున, పిలిచి చెప్పేటందుకు గొంతువిడక, ఉగ్గబట్టుకునే ఓపిక లేక మలమూత్రాలు పక్కలోనే విడిచింది రంగమ్మ.

ఆ దుర్భరమైన వాసననీ తలపుమాత్రంగానే జుగుప్స కలిగించి, ఒళ్లు జలదరింపచేసే కల్మశం శరీరాన్ని తాకుతూంటే కలుగుతున్న అసహ్యాన్నీ భరించలేక, భరించక చేసేదేమీ లేక నిస్సహాయంగా బ్రతికుండే నరకాన్ని చవి చూస్తోంది రంగమ్మ.

తల్లి నా దుస్థితిలో చూస్తూ నీరుగారి పోయాడు నాగయ్య 'కన్నులున్న అంధత్వం కావాల్సినదీ సమయాల్లోనే.' అనుకున్నాడు కనుకొనల్లో పూరిన తడిని కండువాతో ఒత్తుకుంటూ.

బావగారిని గమనించిన లక్ష్మీకాంత పెరట్లోనే పురాణం విప్పింది.

'పనిమనిషి ఇంతవరకూ రాలేదట;దుర్వాసనలో ఇల్లు పాయిఖానా అనిపిస్తోందట; పిల్లలు ఇంట్లో నిలవలేక వాకిట్లోనే ఉన్నారట ఇప్పటిదాకా; లానీ ఛండాలాలన్నీ సహిస్తూ వుండలేకపోతున్నదిట; ఏనుయ్యో గొయ్యో చూసుకుని ఈ యమచర తప్పించుకోవాలనున్నదిట; ఇంతకీ ఏనాడో తను చేసుకున్న పాపం ఈ రోజున ఈ రూపంగా తనని పట్టిపల్లారుస్తున్నదిట...' ఆనకట్టలేని ప్రవాహచందాన ఇలా సాగిపోతున్నదామె ధోరణి.

'చెవులుండీ బధిరత్వం నాకెందుకొసగ లేదు భగవాన్.' అనుకున్నాడు నాగయ్య అశాంతిగా కణతలు రుద్దుకుంటూ.

అప్పుడే దిగడిన పనిమనిషి రంగమ్మ పక్కా బట్టలు మార్చి ఒళ్లు శుభ్రం చేసింది. నాగయ్య వెచ్చజేసి తీసుకొచ్చిన పాలు ఆమె చేత తాగిస్తూ రహస్యంగా వెల్లడించిందొక విషయం.

ఈ మూడు రోజులబట్టీ నాగయ్య స్వయంగా ఇచ్చి వెడుతున్న ఈ స్వల్ప ఆహారం తప్ప తల్లికి పగలంతా మరే ఇతర ఆహారమూ ఇవ్వటంలేదట. రాత్రి అయ్యేవరకూ అలా ఆ ఖాళీ కడుపుతోనే పడి వుంటున్నదట రంగమ్మ.

మమతానురాగానికి దూరంగా వుండాలనుకుంటూ అన్నింటా విరక్తి ఏర్పరుచుకుంటున్న నాగయ్య చలించిపోయాడా సంగతి విని.

'మనస్సుండీ నిర్వికారత్వం నాకెప్పుడను గ్రహిస్తావు ప్రభూ!' అని ద్రవించిన హృదయంతో మొరపెట్టుకున్నాడు ధ్వనించని ఆ వేలుపుతో.

ఆ సాయంత్రమే తల్లిని తన ఇంటికి తీసుకుపోయాడు నాగయ్య.

ఏదో లాంఛనానికి తప్ప పెద్దగా అభ్యంతర పెట్టలేదు తమ్ముడూ మరదలూ ను.

జగన్ మిథ్య అంటూ శుష్కవేదాంతం మాటున బాధ్యతను విస్మరించే కువేదాంతిలా కాక కర్తవ్య నిర్వహణలోనే ముక్తిమార్గాన్ని వెతుక్కోవాలనే జ్ఞానం కలవాడు నాగయ్య.

భార్యా వియోగం కలిగినప్పుడూ, చంచలాక్షి అయిన లక్ష్మి అనుగ్రహం తప్పి ఆస్తిపాస్తులు ఊడ్చుకుపోయినప్పుడూ, నా గతి ఏమా అని తల్లక్రిందులయిపోక, తిరిగి వ్యాపారాన్ని పునరుద్ధరించుకోవాలనీ, కుటుంబ లంపటంలో మళ్లీ తలదూర్చాలనీ తాపత్రయాలు పెంచుకోక నిర్విచారంగా ఎలాగయితే వైరాగ్య పథాన్నవలంభించాడో అదే విధంగా తల్లికి తనసేవ అవుసరమని గ్రహించిన తత్షణం నిస్సంకోచంగా ఆ బాధ్యత స్వీకరించాడు.

తన శాయశక్తులా ప్రయత్నించి తల్లి చివరి రోజులు ప్రశాంతంగా గడిచిపోయేటట్టు చూడటమే తన ప్రస్తుత ధ్యేయంగా పెట్టుకున్నాడు.

అన్నం మెత్తగా కలిపి ముద్దలుచేసి చంటిపిల్లడికి తినిపించినట్టు నోటికి అందిస్తూంటేనూ, జుట్టుకి నూనెరాసి చిక్కుతీసి ముడి వేస్తూంటేనూ, మలమూత్రాదులు సయితం చిరాకు పడక ఎత్తిపోస్తుంటేనూ,— 'ఆఖరికి ఈలాంటి పనులు గూడా మగబిడ్డడితో చేయించుకోవలిసి వచ్చిందే–' అని సిగ్గుతో కుచించుకుపోయేది రంగమ్మ.

అది గమనించి, "ఇంతకు మించిన సేవలెన్నో చేస్తేనే ఈ నాటికి ఇంతవాళ్ల మయ్యాము మేము. నువ్వు చేసిన సేవలో సహస్రాంశం వుండదు నేను నీ కిప్పుడు చేసేది. నీళ్లుపోసి పోషణచేసి పెంచిన చెట్టు నించి కాయకోసుకునేటందుకు బిడియపడతావెందుకమ్మా?" అనేవాడు చల్లగా నవ్వుతూ.

మధ్యాహ్నంపూట నాలుగు మెతుకులు ఇలా కతికేవాడో లేదో ఏ పోస్టాఫీసుకో పరిగెత్తేవాడు. రాత రానివాళ్లు ఆ వూళ్లో కొల్లలు. ఎవరికయినా ఉత్తరాలో, కవుళ్ల కాగితాలో రాసిపెట్టి వాళ్లిచ్చిన పైసో పావులో తీసుకుని, అది పెట్టి పండో ఫలమో కొని తల్లికి ఆపేక్షగా తినిపించేవాడు.

రంగమ్మ తల్లి మనసు 'నా కోసమెంత ప్రయాసపడుతున్నాడో గదా నా బిడ్డ!' అన్న మథనతో కృంగిపోయి, 'నేనంటే ఎంత ప్రేమో నా నాయనకు' అన్న భావనతో పొంగి పోయేది.

పగలు తీరుబాటు అయినప్పుడు తల్లి మంచం పక్కంటే కూర్చుని అరవిందుని గ్రంథమో, గీతా వాఖ్యానమో పైకి చదివి వినిపిస్తూ తనకి అవగతమయినంత వరకూ వాటి సారాన్ని ఆమెకు వివరించి చెప్పేవాడు నాగయ్య.

రాత్రి నిద్రపోయే ముందు ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలో, గీతగోవిందమో, భాగవతంలోని పద్యాలో గొంతువిప్పి కమ్మగా పాడేవాడు.

మనస్సు నిర్మలంగా భగవంతుని సంస్మరణంలో పరవశించి పోతుండగా...హాయిగా... ప్రశాంతంగా ఎప్పుడో తనకు తెలియకుండానే సుషుప్తిలో మునిగిపోయేది రంగమ్మ.

* * *

పల్లెటూళ్లలో పట్నవాసంలోలాగా పక్కవాళ్ల సంగతి పట్టించుకోకుండా ఎవరెట్లాపోతే మనకేమనే దృక్పథంలో వుండరు.

తప్పు కనిపించినా, మామూలుకు భిన్నంగా ఏదయినా జరిగినా వూరూ నాడూ ఏకమై తూర్పార బట్టేస్తుంది.

ఈ గుణం పరిస్థితులనిబట్టి ఒక్కొక్కప్పుడు చెడు నడతను బడ్డవాడికి బుద్ధిగరిపి మంచి దారికి మళిపేదిగానూ ఉండవచ్చు; మరొకప్పుడు మూర్ఖత్వానికి దారితీసి మంచి మనిషికే ఘోరమయిన హింసగా పరిణమించవనూ వచ్చు.

ఈత వెనకబట్టి వట్టిపోయిన గోవుని దానం పేరిట గో సంరక్షణకి తోలినట్టు, చేసినన్నాళ్లు చేయించుకుని మూలపడ్డాక తల్లిని అన్న ఇంటికి అప్పగింతలు పెట్టిన శేషయ్యని వూళ్లో అందరూ దుయ్యబట్టసాగారు. చాకలి వెంకి మొదలుకొని వూరికి పెద్ద కామందయిన రాఘవరెడ్డి వరకూ చిన్న పెద్దా అందరి దృష్టిలోనూ శేషయ్య పలుచనై నాగయ్య ప్రశంసా పాత్రుడయినాడు.

నిర్మొహమాటస్తులు కొందరు శేషయ్యనీ, లక్ష్మీకాంతనీ 'ఇదే మన్యాయం. మీకుమాత్రం రాదా పెద్దతనము'ని మొహమ్మీదే అడిగారు కూడా.

శేషయ్య అయితే దొంగకి తేలుకుట్టినట్టు మెదలకుండా వూరుకునేవాడు; నీళ్లు నములుతూ విషయాన్ని దాటెయ్యడానికి ప్రయత్నించేవాడు; విన్నబోయిన మొహంతో చిన్నబుచ్చుకునేవాడు.

ధూర్తత రెండు విధాలు. పైకి కప్పిపుచ్చాలని చూసినా కనీసం మనసులోనైనా చేసిన తప్పుపనిని తప్పే అని ఒప్పుకోగలగటం; అలాటివాడే శేషయ్య.

ఇక రెండోరకం. తన తప్పుని మనస్సా వాచా సమర్థించుకోవటమేకాక తప్పుని చెప్పిన వాళ్ళదే తప్పని ఎదురు తిరగటం; ఆ బాపతే లక్ష్మీకాంత.

ఇదేమన్న వాళ్లమీద విరుచుకు పడేది లక్ష్మీకాంత. వాళ్ల మూడు తరాల క్రింద నలుపులన్నీ వెతికి మీరూ పత్తిత్తులు కారులెమ్మని వాళ్ల నోరు మూయించేది; అంత జాలిగల వాళ్లు తీసికెళ్లి పోషించి చూడండని సవాలు చేసేది; పైగా వీళ్లందరినీ ఉసిగొలిపి తమ మీదికి తరిమేది బావగారేనంటూ ఏ పాపమెరుగని నాగయ్య మీదకూడా నాలుగక్షింతలు వేసేది.

కపటంలేని నాగయ్యమటుకు తమ్ముడూ మరదలూ ఊరందరి నోళ్లలోనూ నాను



తూండటం చూసి కష్టపడేవాడు. "ఇన్నేళ్లు అమ్మని అరిచేతుల్లో పెట్టుకుని అపురూపంగా చూసింది వాళ్లు కదా! ఇప్పుడయినా వాళ్లేం తోసి పంపలేదు. మాతృణం నాకు మాత్రం తీరేదెప్పుడని పట్టుబలవంతాన నేనే తీసుకొచ్చానింటికి." అనే చెప్పేవాడందరికీ.

అయితే అతనాశించినట్లు లోకుల ధోరణి గానీ, అభిప్రాయంగానీ మారలేదు. కాగా తనని నిందించే వారి తప్పుల్ని సయితం దాచ జూస్తున్న అతని క్షమాగుణాన్నీ, లక్ష్మీకాంత గయ్యాళి గచ్చుతనాన్నీ మునుపుకన్న ఎక్కువగా చెప్పుకోసాగారు.

* * *

ఎవ్వరే మనుకుంటున్నా కాలం మాత్రం ఆగలేదు. తెరిపి లేకుండా వచ్చి పడుతున్న ఘడియల్నీ, దినాల్నీ వెనక్కి నెట్టేస్తూ ముందుకు సాగిపోతూనే వుంది.

ఈ మధ్యలో రంగమ్మకి మరోసారి హెచ్చుచేసి తగ్గటం జరిగింది. ఈసారి స్ట్రోక్‌వస్తే బ్రతుకుతుందనేది అనుమానమే వని అన్నాడు పట్నంనించి వచ్చిన డాక్టరు.

నాగయ్య కంటికి రెప్పలా కాచుకుంటు న్నాడు తల్లిని. కాని గెలకొట్టిన అరటి చెట్టుకి ఎంత బలంవేసినా లాభం లేనట్టు ఆయుర్దాయం తీరిపోవస్తున్న రంగమ్మకి అతని పరిచర్యలుగానీ తీసుకుంటున్న మందులు గానీ ఒంటబట్టడంలేదు. రోజు రోజుకీ దిగ జారిపోతున్న ఆరోగ్యంతో ఔటర్‌లో సిగ్నల్ కోసం కాచుకునున్న రైలుబండిలా భగవంతు

## లోకం పోకడ

ని చే సంజ్ఞకోసం నిరీక్షిస్తోంది రంగమ్మ.

ఆ పిలుపు రావటానికి గూడా ఎంతో కాలం పట్టలేదు. పక్షవాతం మూడో మారు తిరగ బెట్టింది.

ఆ రోజు రంగమ్మ కళ్లు తప్ప మిగతా అవయవాలన్నీ స్వాధీనం తప్పాయి. కొండెక్క బోయే దీపంలా రెప రెప లాడుతోందామె ప్రాణం.

డాక్టరు వచ్చి పెదవి విరిచి వెళ్ళి పోయాడు. ఆవరిస్తున్న విషాదంలో కర్తవ్యతా శూన్యుడై కూర్చుండి పోయాడు నాగయ్య.

ఎక్కడ పుట్టినా ఆ వూరుని మెట్టి అక్కడే మట్టయిపోతున్న ఆ వూరి కోడలామె.

సంగతి తెలిసి ఇరుగుపొరుగులూ, తెలిసిన వారూ ఒక్కొక్కరూవచ్చి చూసిపోతున్నారు.

వారిలో ఒకరు అడుగుతున్నా రింకెవరినో. "శేషయ్య కనబడడేం? కబురందలేదా ఏం?" అంటూ.

"పంపకేం? గంటాయె పిల్లగాణ్ణిపంపి. ఇప్పటిదాకా అయిపూ అజా లేదు పెద్దమనిషి." నిరసనగా జవాబిచ్చారు ఎవరో.

గప్పున స్ఫురించింది నాగయ్యకి అప్పుడున్న వెలితేమిటో. 'ఈ వచ్చి పోతున్నవాళ్లందరూ కేవలం గట్టున నిలబడి సానుభూతి చూపించే వాళ్లే తన దుఃఖంలో పాలుపంచుకొనేవాడు తమ్ముడొక్కడే' అని.

వెంటనే లేచి తమ్ముడికోసరం వెళ్ల బోయాడు. అతన్ని అడ్డుకున్నదో ఇల్లాలు.

"ఎందుకయ్యా నువ్వు పరిగెత్తేది? ఆయనకులేని ఆరాటం నీ కెందుకంట? అయినా ఆ ఇంటికి ఈ ఇల్లెంత దూరమో ఈ ఇంటికి ఆ ఇల్లూ అంతే దూరమన్నారు. ఈ తల్లిమీద ఆపేక్ష ఆ కొడుక్కి ఎప్పుడైతే ఎగిరిపోయిందో–ఆ కొడుకుమీద ప్రీతి ఈతల్లికి అప్పుడే అడుగంటింది. నన్నడిగితే ఆవిడకి నువ్వొక్కడివే కొడుకువంటాను. జవముడిగాక విధికీడ్చిన కొడుకొక కొడుకా అని? అతనికోసం నువ్వేం పరుగులు పెట్ట నక్కరలేదు గానీ అక్కడికాగు." ఖండితంగా అన్నదామె.

"అవునవును." "నిజం చెప్పావు." "బాగా చెప్పావు." ఇత్యాది విశేషణాలతో అక్కడున్న వాళ్లందరూ ఆమె వాదన ఆమోదిస్తూ తలలూపారు.

'పరిస్థితులకి తలవంచి తనని కొంత చిన్న చూపు చూచినంత మాత్రాన, బిడ్డమీద తల్లికి మమతా, మమకారం మాసిపోతుందా? నమ్మశక్యం కానిసంగతి.'

తల్లిదగ్గరగా వెళ్లాడు నాగయ్య. "ఏమ్మా శేషుని చూడాలని లేదూ?"

రంగమ్మ నీళ్లనిండిన కళ్లలో ఆందోళనా, ఆతృతా స్పష్టంగా అగుపడింది.

"నే వెళ్లి పిలుచుకురానా?"

క్షణంలో ఆమెకళ్లు వెలిగాయి. చెంపలంట కన్నీరు దిగజారింది.

ఇక ఎవరిమాటా లక్ష్యపెట్టలేదు నాగయ్య.

శేషయ్య వచ్చిన కొద్దిసేపట్లో రంగమ్మ ప్రాణాలు గాలిలో కలిశాయి. పోయేముందర తల్లికళ్లలో గొప్ప సంతృప్తి చూడగలిగేడు నాగయ్య.

* * *

రంగమ్మ పోయిన మూడవరోజున, "ఏం నాగయ్యా! కర్మ మొదలుపెట్టాలిహ." అంటూ వచ్చాడు పురోహితుడు.

దిన వారాలకి కావాలిసిన వస్తువులంటూ ఆయన వ్రాసుకొచ్చిన రెండు పేజీల జాబితా చేసి చూస్తూ తల తడుముకున్నాడు నాగయ్య.

జీవుడు; వైతరణి; పుత్రుడు: పున్నామ నరకం; ఏడాది గ్రాసం; గోదానం, భూదానం; సువర్ణదానం; అన్నదానం ... ఏవేవో ఏకరువు పెడుతున్నాడాయన.

వింటూ వుండిపోయాడు నాగయ్య.



ఆకలి దప్పులకీ, మాయా మమకారాలకీ లొంగే ఈ శరీరాన్ని విడిచి పంచభూతాల్లో లీనమయిపోయిన జీవికి కూడా బాధలూ బంధాలూ అంటగట్టి ఏవో క్రతువులూ కర్మలతో వాటిని తొలగిస్తామంటారు.

పితృదేవతలకంటూ బతికివున్న వారికి దానాలిమ్మని అది మరణించిన వారికి చెందుతాయంటారు.

వీటికి రుజువులేదు. చెప్పే సాక్ష్యాధారాలు కల్పితాలు. అయినా వాట్నని తప్పనిసరిగా నమ్మాలి; లోకానికి వెరిచన్నా ఆయన చెప్పినవన్నీ ఆచరించి తీరాలి.

ఆయన ప్రసంగం ఆఖరయింది. ఈ తతంగాలమీద పెద్దగా నమ్మకం లేకున్నా ఏటికి ఎదురీదే రకంకాదు నాగయ్య.

కానీ ఎలాగని? నాగయ్య మరోసారి తల తడుముకున్నాడు.

తల్లి వచ్చినప్పటినించీ అక్కడక్కడా చిన్నం చితకా మొత్తాలు చేబదుళ్ళు తెచ్చాడు. ఇల్లయితే ఎప్పుడో తాకట్టు పెట్టేశాడు. అది అమ్మి అప్పులు తీరిస్తే మిగిలేది హళ్లికి హళ్లి–సున్నకి సున్న.

నాగయ్య లోపలికి వెళ్లి పదిరూపాయలూ, ఒక పదిపైసల బిళ్లా పట్టుకొచ్చాడు. తాంబూలంలో వుంచి పురోహితుడి చేతిలో పెట్టి తల్లిని తలుచుకుని రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేశాడు.

క్షణం వెలవెలబోయి, అంతలోనే అతని భావం అర్ధమయి నొసలు చిట్లించాడు పురోహితుడు.

ఆ పైన హితబోధ ప్రారంభించాడు; కొడుకనీ, కర్తవ్యమనీ ఏవేవో అరగంటసేపు వల్లించాడు.

తర్కించలేదు. అన్నింటికీ ఒకటే సమాధానం చెప్పాడు. "ఇంతకుమించి నాకు శక్తి లేదు" అని.

డబ్బు రెంటిని దోపి గొణుక్కుంటూ వెళ్లిపోయాడాయన.

* * *

మర్నాడు చిరచిరలాడుతూ పైకొచ్చే సూరీడుతోపాటు నాగయ్య తల్లికి పిండంవేసి తర్పణాలు వదలనన్నాడన్న వార్త కూడా చరచరా వూరంతా వ్యాపించిపోయింది.

చిత్రమేమిటంటే ఈ వార్తకి అనుబంధంగా జోడించి చెప్పుకుంటున్న మరో సంగతి;

శేషయ్య పెద్దఎత్తున కర్మ ప్రారంభిం

(42 వ పేజీ చూడండి)

బస్సు ఆగిన కుదుపుకు మెలుకువ వచ్చింది కళ్లు తెరిచాను.

"అరేయ్, లేవరా! హన్మకొండ వచ్చింది." భుజంమీద తట్టాడు అన్నయ్య.

ఒకసారి కళ్ళు నులుముకుని తెరిచాను. అందరూ బస్ దిగుతున్నారు. అది హన్మకొండ వరకే. మేమూ దిగి మళ్ళీ ఖమ్మం బస్‌లో ఎక్కాలి. ఒకసారి వళ్ళు విరుచుకుని లేచి బ్యాగ్ అందుకుని దిగాను. నాతో పాటే దిగాడు అన్నయ్య.

బస్‌స్టాండ్ మొత్తం కళకళలాడుతున్నది. అసలే పెళ్ళిళ్ళ సీజన్. అంతా కొత్తబట్టల రెపరెపలతో నిండిపోయింది. అసలు మేమూ కరీంనగర్‌లో ఓ బంధువుయింట్లో, పెళ్ళికే వెళ్ళి వస్తున్నాము. రాత్రంతా నిద్రలేక బస్‌లో పగలయినా మంచినిద్ర పట్టింది.

వరంగల్‌లో ఎవరూ తెలిసినవాళ్ళు లేకపోవటంవల్ల మేము వెంటనే బస్ ఎక్కాలి. కంట్రోల్‌రూమ్‌లో కనుక్కుంటే యింకొక గంటకు కానీ బస్ లేదన్నారు. ఇద్దరమూ మొహం మొహం చూసుకున్నాము, 'ఏంచేద్దా' మన్నట్లు.

"చేసేదేముంది? ఇక్కడనే కూర్చుందాము" అన్నాడు అన్నయ్య

కొత్తగా కట్టిన బస్టాండు విశాలంగా ఉంది. కాలక్షేపం కోసం ఓ వీక్లీ కొనుక్కుని వచ్చాను. కూర్చునే ప్లేస్ అంతా నిండిపోయింది. చేసేదిలేక బ్యాగ్ ప్రక్కన, కింద పెట్టి ఓ స్తంభానికి ఆనుకొని వీక్లీ తిరగెయ్యటం మొదలెట్టాను. పుస్తకాలు చదవడం అలవాటులేని అన్నయ్య అటూ, ఇటూ చూస్తూ నిల్చున్నాడు. తను ఓ స్తంభానికి ఆనుకుని. తిరగేస్తూనే కథలు చదవటంలో మునిగిపోయాను నేను.

"అరేయ్! అటుచూడు." ఓ పదినిమిషాల తరువాత అన్నయ్య భుజం తట్టి, పిలిచిన పిలుపుకు ఉలిక్కిపడి అన్నయ్య వైపు చూశాను.

"అక్కడ చూడు. నీకు కథ కేమైనా ప్లాట్ దొరుకుతుందేమో" అన్నాడు ఓ వైపు చూపెడ్తూ.

అటుచూశాను. ఓ చోట ఓ పదిమంది గుంపుగా నిల్చుని ఉన్నారు. ఆ గుంపు పెళ్లి నుంచి వచ్చేదో, పెళ్లికి పోయేదో - మొత్తం మీద ఓ పెళ్లివారి గుంపు అని ఈజీగా గుర్తు పట్టవచ్చు. వాళ్ల కట్టుకున్న బట్టలు కొత్తవే అయినా, ఆ కట్టూ, బొట్టూ, వాళ్ల హావభావాలు వాళ్లు ఏ తరగతికి చెందినవారో, చెప్పకనే చెప్తున్నవి.

"ఆ, లేబర్‌క్లాసు. హైక్లాసు కాదు, మనక్లాసుకాదు. సంస్కారంలేని మనుషులు. అక్కడేం కథా వస్తువు ఉంటుంది?"




# సంస్కారం

"పద్మశ్రీ"

మొహం చిట్లించి అన్నాను.

"ఆహ! అలా అనబోకు అసలు చూడు" అన్నాడు అన్నయ్య.

చదువుతున్న కథలోని ఆరడుగుల హీరో పొడుగాటి కారు, అందమైన లేతబుగ్గల హీరోయిన్‌ను వదిలిపెట్టాలంటే బాధ అనిపించినా, అన్నయ్య గట్టిగా అనేసరికి అటు చూశాను పుస్తకం బంద్‌చేసి.

కొత్త బట్టలలో మెరిసిపోతున్నాడు ఓ పాతికేళ్ల యువకుడు. తలకు నూనె బాగా పట్టించేసరికి ఎండలో నిగ నిగ లాడుతున్నది అతని జుట్టు. నోట్లో పాన్ తెగ నములుతూ ఒకవైపు చూస్తున్నాడు. 'పెళ్లికొడుకట్లుంది' అనుకుంటూ అతను చూసేవైపు చూశాను.

ఓ పదహారేళ్ల అమ్మాయి, లేత గులాబీ రంగు టెర్లిన్ చీరె, తళతళలాడే జాకెట్ వేసుకుని ఓ పక్కకు నిల్చుని ఉన్నది. అమాయకంగా కనిపించే కళ్లు మాటిమాటికీ చీరె చెరగుతో ఒత్తుకుంటూ ముక్కు ఎగపీలుస్తూ తలవంచుకుని ఉన్నది. అయితే మాటిమాటికీ కొద్దిగా బెదురు బెదురుగా ఓవైపు చూస్తున్నది.

ఆ అమ్మాయిని కాసేపు పరికించి, ఆమె బెదురుగా చూసే వైపుకు చూశాను. ఓ 40-45 ఏళ్ల భారీ ఆడ విగ్రహం అక్కడ నిల్చొని ఉన్నది. ఆమె చుట్టూ ఓ అయిదారుగురు ఆడ, మగ నిల్చొని ఉన్నారు. అందులో సుమారు ఓ 45 ఏళ్ల అతను, ఓ ముప్పై అయిదు ఏళ్ల ఆడమనిషీ ఆ భారీ విగ్రహానికి ఎదురుగా నిల్చొని ఏమో విన్నవించుకుంటున్నారు. కానీ ఆ భారీ విగ్రహం ముఖంలో ఏదో పట్టుదల కనిపిస్తున్నది. అన్నయ్య వైపోసారిచూసి బ్యాగు అందుకొని ఆ గుంపు వైపు అడుగులు వేశాను. వాళ్ళ మాటలు వినవచ్చేటంత దగ్గరకు వాళ్ళవైపు నడిచి ఆగిపోయాను. అన్నయ్యకూడ నాతోపాటె వచ్చి, నా పక్కనే నిల్చున్నాడు. ఇప్పుడు వాళ్ల మాటలు బాగా వినపడుతున్నవి.

"ఏదో, సమయానికివీలు కాలేదంటున్నాడు కదా! మీరు యిప్పుడు అట్లా పట్టుపడితే ఎట్లా?" గుంపులో ఓ వ్యక్తి అంటున్నాడు.

"ఔనమ్మా! శానా పయత్నం శేశాను కానీ నా కర్మ బాగానేదు." ఆ నలభై ఏళ్లతను అంటున్నాడు.

"ఓయబ్బో! మహా పెయత్నం శేశినావు కానీ, యిప్పుడు యియ్యాలిసిందే. మాట అన్న తరువాత పానం పోయినా తప్పకూడదు. యాదుంచుకో." ఆ భారీ విగ్రహం కంఠంలో కొద్దిగా కోపం ధ్వనించింది.

"పొలం కొన్న నాయాళ్లు డబ్బు సమయానికి యివ్వలేదమ్మా! నేను శానా గట్టిగా సెప్పాను. కానీ ఆల్లకు కూడ పైకం అందలేదట."

విషయం అర్థమైంది. అన్నయ్య ముఖంలోకి చూశాను. ఇద్దరమూ మాట్లాడలేదు. ఇద్దరికీ క్రితం రోజు మేము వెళ్లిన పెళ్లిలో జరిగిన సంఘటనలే గుర్తుకు వచ్చినవి.

క్రితంరోజు పెళ్లిలో యిలాగే జరిగింది. అమ్మాయి తండ్రి పైకం సరిగ్గా అందక యిస్తానన్న కట్నంలో ఓ నాలుగువేలు సమయానికి యివ్వలేకపోయాడు. అంతే- "కట్నమియ్యందే తాళి కట్టడు మా వాడు" అని భీష్మించుకు కూర్చున్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

"బావగారూ! సమయానికి డబ్బు అందలేదు. ఆడి తప్పటమనేది మా వంశంలో అలవాటులేదు. డబ్బు అందగానే మీకు యిస్తానన్నకట్నం పువ్వులలో పెట్టి అందజేస్తాను" పెళ్ళికూతురు తండ్రి అభ్యర్థించాడు.

"అదేం పిల్లేదు. మీ వాళ్లు యిదివరకు ఆడి తప్పారో, లేదో మాకనవసరం. ఇప్పుడు మీరు తప్పారు. అఫ్టరాల్. నాలుగువేలు మీరు సమకూర్చుకోలేక పోయారంటే..." విసుగు ధ్వనించింది పెళ్ళికొడుకు తండ్రి కంఠంలో.

"ఆడపిల్లవాళ్ళం. మమ్మల్ని నవ్వులపాలు చేయవద్దు." మొరపెట్టుకున్నాడు ఆ తండ్రి.

"మేం చేసేదేముంది? మీరే చేసుకున్నారు" మగపెళ్లివాడితండ్రి తనహోదా ప్రదర్శించాడు.

తను చదివిన పుస్తకాలలో, చూసిన సినిమాలలో హీరో చేసే పనులన్నీ గుర్తుకు వచ్చి ఏదో అందామనుకుంటున్న పెళ్ళికొడుకు వాళ్ళ నాన్నవైపు చూస్తూనే తల వంచుకుంటూ తెగ సతమతమవుతున్నాడు.

చూట్టూ ఉన్న కొందరు నవయువకులు "ఛీ! యింకా వాళ్ళతో సంబంధం ఏమిటి? డబ్బుకు అంత పట్టుదల పట్టాడా? సిగ్గు లేకపోతే సరి. ఇంకో సంబంధం చూడండి." అంటున్నారు.

"అహ! తొందరపడకండి." అనుభవజ్ఞులు సలహా యిస్తున్నారు.

పెళ్ళికూతురు తండ్రి జాలిగా అడిగితే



పెళ్ళికొడుకుతండ్రి నిర్దయుడిగా కొట్టివేశాడు. అతను గద్గదకంఠంతో అభ్యర్థిస్తే యితను కోపంగా తిరస్కరించాడు. అతను కన్నీళ్ళు పెట్టుకుంటే యితను మీసం మెలివేశాడు. అతను బాధపడితే యితను నిర్లక్ష్యంగా చూశాడు.

చివరికి కొంతమంది అటు పెద్దలూ, యిటు పెద్దలూ కలిసి ఓ పెద్దమనుషుల ఒప్పందానికి వచ్చారు. ఇప్పుడు పెళ్ళి ఆటంకం లేకుండా జరిగేటట్లు, పెళ్ళి అయిన వెంటనే ఆ నాలుగువేలకూ ఓ ప్రోనోటు వ్రాసి యిచ్చేటట్లు, తరువాత ఆడబ్బు అంతా తెచ్చియిచ్చి నోటు చెల్లువేసిన తరువాతనే అమ్మాయిని కాపురానికి తీసుకుని పోయేటట్లు ఒప్పందం జరిగింది.

తాళి కట్టబోతున్న పెళ్ళికొడుకు "చూశావా! నేను చేయబట్టే మానాన్న యిలాగైనా ఒప్పుకున్నాడు." అన్నట్లు తానేదో గొప్పపని చేసినట్లు పెళ్ళికూతురు ముఖంలోకి చూశాడు.

తరువాత పెళ్ళి జరిగిపోయింది.

జరిగిన సంగతి అది. ఇప్పుడు వీళ్ళూ అదే పంచాయితీలో పడట్లున్నారు. అయితే యిక్కడ అందరూ సానుభూతిగా మాట్లాడుతున్నారు తప్ప పరిష్కారం సూచించటంలేదు.

నాకో ఆలోచన వచ్చింది. నిన్న పెళ్ళిలో మేము పిల్లగాళ్ళ కిందే లెక్కకాబట్టి ఏం మాట్లాడలేక పోయినాము. ఇక్కడ మనం అదే పరిష్కారం సూచిస్తే ...

నెమ్మదిగా వాళ్ళదగ్గరికి అడుగులేశాను. కొద్దిగ తెల్లటి బట్టలు, షూస్ వేసుకొని, స్టైల్‌గా చేతిలో కూలింగ్‌గ్లాసెస్‌తో వాళ్ళ దగ్గరికి నడిచిన నన్నుచూసి ఒకరిద్దరు తప్పుకున్నారు.

"సంగతి ఏమిటి?" నెమ్మదిగా అడిగాను ఒకతన్ని.

అప్పుడే ఎటో చూస్తున్న ఆ భారీ ఆడ విగ్రహం నావేపు ఓసారి చూసింది. నాప్రశ్న విన్న ఆ పెళ్ళికూతురు తండ్రి నన్ను చూడ గానే ఏదో ధైర్యం వచ్చినట్లు నాదగ్గరికి వచ్చాడు.

"సూడండి బాబుగారూ! కట్నంకింద ఏదో ముట్టసెబుతామన్న మాట సత్తెమే. కానీ పైకంకోసం నానా బాధలు పడ్డా, అన్నీ అందనేదు. తరువాత యిస్తామంటే యిప్పుడు యీ అమ్మ యినటంనేదు" ఆ తండ్రి అన్నాడు.

ఆ భారీ ఆడ విగ్రహం వైపు చూశాను. ఆమె అప్పటివరకూ ఎటో చూసి అప్పుడే నా

# సంస్కారం

వైపు తల త్రిప్పింది.

ఆమె వైపోసారి చూసి, తిరిగి పెళ్ళి కూతురు తండ్రివైపు తిరిగాను. "కట్నం ఎంత యిస్తామన్నారు?" అడిగాను.

"అబ్బాయికి ఓ ఉంగరం, ఓ గడియారం అబ్బాయి తల్లికి పట్టుకోక, ఎంది నూర్లు నగదు యిస్తామన్నాం బాబుగారూ!"

"ఎంతిచ్చారు?" ప్రశ్నించాను.

"ఉంగరం, గడియారం యిచ్చాం బాబు గారూ! నగదులోనే ఓ నాలుగు వందలు ముట్టనేదు" జాలిగా అన్నాడు అతను.

"అష్టరాల్! నాలుగు వందలు. నాకు వచ్చే ఓ నెలజీతం అంత లేదు. నాలుగు వందల కోసం యింతపట్టుదలా? ఓ పచ్చటి జీవితం పాడవుతుందా?" ఆశ్చర్య వేసింది.

"ఏమమ్మా! మీరేమంటారు?" 'నీవు' అనటానికి ధైర్యం చాల్లేదు ఆ భారీ విగ్రహాన్ని.

"ఏముంది బాబుగారూ! డబ్బు యిప్పుడు యియ్యాల్సిందే" ముభావంగా జవాబిచ్చి దేని కోసమో ఎదురు చూస్తున్నట్లుగా ఎటో చూసి మళ్లీ యిటు తిరిగింది ఆమె.

బహుశః యింకా తన వాళ్లు ఎవరైనా రావాలేమో! తనకు సపోర్టుకోసం చూస్తు న్నట్లున్నది.

"ఇస్తాను బాబుగారూ! కొద్దిగా ఏసులు బాటు కాగానే యిచ్చేస్తాను" జాలికొల్పే విధంగా అన్నాడు ఆ అమ్మాయి తండ్రి.

"మరి పెళ్లయిందా?"

"అయింది బాబుగారూ!"

"అరె! ఎలా అయింది? ముందుగా కట్నం అడగలేదా?" ఆశ్చర్యపోయాను.

"లేదు బాబూ! ఇప్పుడు అమ్మాయిని తీసుకువచ్చి పంపేముందు అడిగారు. అసలు సంగతి సెప్పాను. గొడవ పెడుతున్నది."

ఆ పెళ్ళికూతురు వైపు చూశాను. ఆ అమ్మాయి ఓ సారి నీళ్లు నిండిన కళ్ళతో నా వైపు చూసి తల వంచుకున్నది. ఆ పెళ్లి

కొడుకువైపు చూశాను. తనకేమి పట్టనట్లు అతను నోట్లోఉన్న తమలపాకును తెగనములుతున్నాడు. నోట్లోంచి రెండువైపులా రెండు సన్నని చారల్లా తమలపాకు రసం కారుతున్నది. మాటిమాటికి దాన్ని తుడుచుకుంటూ అటూ ఇటూ చూస్తూ నిల్చున్నాడు.

"సరే! నేనో పరిష్కారం చెపుతాను వింటారా?" వాళ్ళ వైపు చూస్తూ అడిగాను

"సెప్పండి బాబుగారూ! తప్పకుండా యినుకుంటాం" నా చేతులు పట్టుకుంటూ అన్నాడు అమ్మాయి తండ్రి.

ఆ భారీ విగ్రహంవైపు చూశాను. కొద్దిగా మొహం చిట్లించి నా వైపు ప్రశ్నార్థకంగా చూసింది ఆమె. 'అభ్యంతర పెట్టలేదు కదా' అని చెప్పటం మొదలు పెట్టాను.

"ఇదిగో చూడమ్మా! అయిందేదో అయింది. ఇప్పుడు గొడవ పెడితే ఏం లాభం చెప్పు. నేను చెప్పినట్లు వినండి. ఆ నాలుగు వందలకు యితను నోటు వాసిస్తాడు. నోటు నీ దగ్గర ఉంచుకో. అతను డబ్బు తెచ్చి నోటు చెల్లువేసిన తరువాతనే అమ్మాయిని కాపురానికి తీసుకు వెళ్లండి. అంతవరకూ అమ్మాయి పుట్టింట్లో ఉంటుంది."

"అతను నోటు చెల్లువేయకపోతే?" ఆ భారీ విగ్రహం ఎటోచూస్తూ అడిగింది.

ఆమె చూసేవైపు చూశాను. ఏదో ఊరువెళ్లే బస్ ప్లాట్‌ఫారం మీదకు వస్తున్నది. ఆమె అడిగిన దానికి ఏం జవాబియ్యాలో తోచలేదు.

ఆ అమ్మాయి తండ్రివైపు చూశాను.

"తప్పకుండా కొద్ది దినాల్లోనే నోటు చెల్లువేస్తాను బాబూ!" ధైర్యంగా అన్నాడు అతను.

"ఇంకేమమ్మా, ఎన్ని కష్టాలు పడయినా కొద్ది రోజుల్లోనే నోటు చెల్లువేసి అమ్మాయిని పంపుతా నంటున్నాడుగా" అన్నాను.

మా మధ్య అన్నయ్య శ్రోతగానే ఉండిపోయాడు.

ప్లాట్‌ఫారం మీద ఆగిన బస్ వైపు చూడగానే ఆ భారీ విగ్రహం కదిలింది.

"ఇక కదలండి అంతా. మన బస్ వచ్చింది" అంటూ చుట్టూ ఉన్న అందరినీ హడావుడి పెట్టింది.

నిస్సహాయంగా నిల్చున్నాడు అమ్మాయి తండ్రి. ఆ భారీ విగ్రహానికి చుట్టూ ఉన్న జనం నెమ్మదిగా బస్‌వైపు కదులుతున్నారు.

"ఏదైనా మీరు యిలా చేయటం బాగా లేదు" కొద్దిగా కోపం ధ్వనించింది నా కంఠంలో.

సామానంతా పంపి నావైపు తిరిగింది ఆమె. "భలే బాగా చెప్పారు బాబుగారూ! ఈన, యిచ్చేడబ్బుకు నోటు వ్రాసిస్తాడా? అప్పటివరకూ అమ్మాయిని యానింట్లో ఉంచాలా? మంచి మాట చెప్పారు. ప్రోనోటుతో కాపురం చేయలా నా కొడుకు?" నిరసనగా అంది.

"మరేం చేస్తారు యిప్పుడు?" ఆశ్చర్యమూ, బాధ, అన్నీ ధ్వనించాయి నా కంఠంలో.

"ఏంచేస్తాం? మా పిల్లగాడు ఎప్పుడు తాళి కట్టాడో అప్పుడే వాడి పెళ్లాం అయింది. ఆయనకు బిడ్డ కాదు యిప్పుడు. నాకు




కోడలు. మా వెంబడే వస్తుంది అమ్మాయి. ఇయ్యాలనుకుంటే డబ్బు యిస్తాడు ఆయన. లేకపోతేలేదు." అంటూ ఆ అమ్మాయి చేతిని పట్టుకుని బస్ ఎక్కింది. ఆమె, చరచరా.

తెల్లబోయాను. మరి యిప్పటివరకూ గొడవ జరిగింది ఎందుకు? నాకు అర్థం కాలేదు. ఆ అమ్మాయి తండ్రివైపు చూశాను. అతనూ వింతగా చూస్తున్నాడు. ఆ అమ్మాయి కళ్లు తుడుచుకుంటూ బస్ ఎక్కటం గమనించాను.

అన్నయ్య వైపు చూశాను. అన్నయ్య ముఖంలో ఏ భావమూ వ్యక్తం కాలేదు. నెమ్మదిగా ఆమె ఎక్కిన బస్‌వైపు కదిలాను. ఆమె అప్పుడే బస్ దిగింది. నావైపు చూసి ఓ చిరునవ్వు నవ్వింది.

"మీరు చేసింది నాకు అర్థం కాలేదు." ఆమెకు దగ్గరగా నడచి అన్నాను.

"మీకు తెలియదులెండి బాబూ! ఆ పిల్ల ఎంత బాధపడుతుంది, మేము వదిలి పెట్టి పోతే! డబ్బుదేముంది, యివ్వకపోతే మానె." అంది.

"అసలు పెళ్ళికి ముందు ఎందుకు అడగలేదు?" నా బుర్రకు ఏమీ అర్థం కావటంలేదు.

"అసలు సంగతి — ఆపిల్ల తండ్రి డబ్బు యివ్వలేడని నాకు తెలుసు, బాబుగారూ! మావాడు ఆ అమ్మాయిని చూసి చేసుకుంటా నన్నాడు. పెళ్ళిముందే అడుగుతే, అతను డబ్బు యివ్వలేకపోతే, పెళ్ళి ఆగిపోతుంది. అందుకే అంతా అయిపోయిన తరువాత అడిగాను."

"అతను యివ్వలేడని తెలిసి అసలు కట్నం ఎందుకు అడగాలి?"

"ఏదో మధ్యవర్తులు కుదిర్చారు. ఇప్పుడు గట్టిగా అడుగకపోతే అందరూ తేలికగా తీసుకుంటారు. అసలు మా ఇండ్లలో ఎంత గొడవపడితే అంత గొప్ప. వాళ్ళకుమాత్రం మేము అంటే లెక్కగా ఉండవద్దూ? అందుకే అడిగాను."

"మరి బస్ స్టాండ్‌లోకూడా ఎందుకు గొడవచేశారు?"

"ఆ! ఏంలేదు బాబుగారూ! బస్ రావటం ఆలీశెం అయింది. ఏదో కాలక్షేపం అవుతుంది కదా అని. అయినా నిజంగానే పిల్లను విడిచి పోతామనుకున్నారా?" చల్లగా నవ్వి, తిరిగి బస్ ఎక్కింది ఆమె.

నిర్ఘాంతపోయాను. ఆమె మాటిమాటికీ దేనికోసమో యిందాకట్నుంచీ చూసినవిషయం గుర్తుకు వచ్చింది. జీవితాన్ని యిలా, యింత తేలికగా తీసుకునే ధైర్యం ఎందరికి ఉంటుంది? 'లైఫ్ ఈజ్ ఏ గేమ్. ప్లే యిట్.' అని ఆమె చెప్పినట్లనిపించింది. మాటల్లో లేని వాళ్ళ సంస్కారం చేతల్లో కనపడింది. నిన్న మా బంధువుల యింట్లో జరిగిన పరిష్కారం, యిక్కడ జరిగిన పరిష్కారం పోల్చి చూసుకున్నాను. ఎవరిది సంస్కారం?

భుజంమీద చేయి పడ్డది. తిరిగిచూశాను. అన్నయ్య!

"బస్ వచ్చింది." నిర్లిప్తంగా అన్నాడు అన్నయ్య.

తెల్లబోవటం చాటున నా సంస్కారాన్ని దాచి వెనుతిరిగాను.

# ఫాలాక్షుని డైరీ

## యోగం : యోగాసనం

జూన్ మూడవ తేదీన మిచిగాన్‌కు చెందిన 29 ఏళ్ల రాబర్ట్ ఆంటొనీ సజ్విక్ అనే ఆయన యోగాసనాలలోని ఓ విధమైన యోగాసనం వేసి, ఆ పోజులోనే చనిపోయాడట. ఈయన చావు నిజంగా సంకల్ప ఫలితమేనా, లేక...అన్నవిషయంమీద పెద్ద పెద్ద శాస్త్రవేత్తలు పరీక్షలు చేస్తున్నారట. "ఆస్ట్రో ప్రొజెక్షన్" అని ఒక విధమైన యోగాసనాన్ని తాను చేయదలుచుకున్నట్లు కనుక తనను ఎవరూ ఆటంకపరచరాదని ఆయన తన స్నేహితులతో అన్నారట. ఆస్ట్రో ప్రొజెక్షన్‌లో మానవుని ఆత్మ శరీరాన్ని విడిచి పైకి లేస్తుందట. ఈ శరీరాన్ని విడిచిన ఆత్మను వో వెండితాడులా కనబడే బంధం శరీరంనుంచి పూర్తిగా ఆత్మపోకుండా పట్టుకొని వుంటుందట. ఈ పరిస్థితిలో ఆసనం సరిగా లేకపోతే ఆ బంధం తెగి, ఆత్మ ఎగిరిపోతుందని, శరీరం చనిపోతుందనీ యోగశాస్త్ర నిపుణులంటున్నారట. నవ్వు ముఖంతో యీ రాబర్ట్ శవం వో రూములో వుండడం ఆయన స్నేహితుడు చూసి ఫిర్యాదు చేశాడట.

## మగాళ్ళ ప్రపంచంలో మగాడైతేనే ..

బిల్‌స్మిత్ అనే ఆయన ఒకటవ ప్రపంచ యుద్ధం రోజుల ముందు రోజుల్లో ప్రఖ్యాత "జాకి" (పందెం గుర్రపు రౌతు) అట. జాకి క్లబ్ డెర్బీని 1903లో సాధించాడట. ఆ తరువాత జరిగిన రెండేళ్లలోనూ ఆయనదే పై చేయట. ఛాంపియన్ షిప్‌ను మూడు సార్లు గెల్చుకున్నాడట. ఆయన్ను లోకమంతా ఎంతో గొప్పగా, ఆశ్చర్యకరమైన వ్యక్తిగా చెప్పుకునేవారట. అయితే ఆయన మరణం ప్రజలనింకా ఆశ్చర్యపరచిందట. మరణానంతరం ఆయన శవంపోస్ట్‌మార్టమ్‌కు పంపబడితే అక్కడి అధికారులు ఆశ్చర్యపోయారట. బిల్‌స్మిత్ పురుషుడు కాదట. ఎవరూ ఆనాటివరకూ బిల్‌స్మిత్ ఒక స్త్రీ అవే గ్రహించలేకపోయారట. చనిపోయేనాటికి బిల్‌స్మిత్‌కు 88 ఏళ్లట – ఫెంటాస్టిక్ యట్ ట్రూ.

## ఆనకట్టలవల్ల అంగవైకల్యమా !

ఆనకట్టలు కట్టి నదీ నీరు పంట కాలువల ద్వారా మళ్ళించడం ద్వారా ప్రజలకు మేలుకన్నా కీడే ఘాటుగా వున్నదని హైదరాబాదులోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ విచారించిందట. ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జునసాగర్ ఆనకట్ట వల్ల ఆ ప్రదేశంలోని ప్రజలకు వో వింత జబ్బు వస్తోందట. ఈ జబ్బు వచ్చినవారి మోకాళ్ళు రెండూ చాలా దగ్గరయిపోయి అక్కడ నుంచి క్రిందికి ఉన్న కాళ్ళు చాలా దూరం అయిపోయి వంగజాపుకున్నట్లు అయిపోతోందని, దానితో వారు అవిటివారివలె అయిపోతున్నారని మోకాళ్ల చిప్పలు చాలా దగ్గరవటం పాదాలు వరకు ఉన్న కాళ్లు దూరమయిపోవడం జరగడం వల్ల చాలామంది తమ తమ పనులు చేసుకోలేని అవిటివారయిపోతున్నారని కూడా యీ సంస్థ ప్రకటించిందట. ప్రకాశం, నల్లగొండ, గుంటూరు జిల్లాలు, కోయంబత్తూరు, హాస్పేట ప్రాంతాలూ పర్యటించి, ఆనకట్టలు కల అన్ని రాష్ట్రాలలోనూ యీ రకం వ్యాధికి గురవుతున్నవారు ఉన్నారని వీరు తేల్చారట!

## కీర్తి ఒక్కటేగా శాశ్వతం

హైదరాబాదులో జూన్ 25న చనిపోయిన ఇడవలూరి లలితాంబ అనే ఆవిడ తన కళ్లను సరోజినీదేవి కంటి ఆసుపత్రికి, తన శరీరాన్ని మెడికల్ కాలేజికి (విద్యార్థులు ఆ శరీర భాగాలను కోసి చూసి చదువుకునేందుకు) రాసిచ్చి చనిపోయిందట. ఈ విధంగా తమ కళ్లను దానంచేసి గుడ్డి వారికి దృష్టిభిక్ష పెట్టమని హైదరాబాదు ఐ బ్యాంకు (కళ్ల బ్యాంకు) కమిటీ గౌరవ సెక్రటరీ మిస్టర్ టి. యల్. కపాడియా అన్నారట.

## శ్రీ కృష్ణమాయా? కాదు...

గర్భం ధరించిన ఒక ఆవు గర్భంలోంచి తత్సంబంధమైన దానినంతటినీ వో పరికరం ద్వారా తీసి, దానిని మరికొన్ని ఆవులలో కూడా ప్రవేశపెట్టే ఆ ఆవులు కూడా గర్భాన్ని ధరించి, మామూలు పద్ధతిలోనే ఎంచక్కా దూడలను కన్నాయట. మెల్‌బోర్న్‌లోని శాస్త్రవేత్తలు చేసిన ఈ అమోఘ ప్రయోగంలో పన్నెండు దూడలు పుట్టి సక్రమంగా పెరిగాయట.

# రైతుకు కుడిభుజము...
# దేవిదయాల్ క్రిమిసంహారిణులు



**నమ్మకము....**
**అదే దేవిదయాల్**
**గుర్తుయొక్క సందేశము**

నమ్మకమైనవి, కాబట్టి దేవిదయాల్ క్రిమిసంహారిణుల శక్తిపై మీరు ఎల్లప్పుడూ ఆధారపడవచ్చును. వారు 20% లేక 50% ఎండ్రిన్ లేదా డిడిటి అని చెప్పినవి. 20% లేక 50%లకు కొంచెము కూడా తక్కువ ఉండవు. కాబట్టి మీరు వాటిని ఎప్పుడు ఉపయోగించినా చాలా శక్తివంతముగా పనిచేస్తాయి. దేవిదయాల్ క్రిమిసంహారిణులు, రెండురెట్లు ఎక్కువ గట్టిగా ఉండే సంచులలో పేకింగ్ చేయబడినందువలన, నమ్మదగినవి. ఇందువలన, వీటిని నిలవ చేసినప్పుడు, పట్టుకున్నప్పుడు, వీటి శక్తి తగ్గక సురక్షితముగా ఉంటాయి.

ఇండియాలో అత్యధిక ఆధునికమైన క్రిమిసంహారిణి ఫ్యాక్టరీలలో ఒకటైన దేవిదయాల్, ఎన్నో రకాల క్రిమి సంహారిణులను మీకు ఇస్తున్నందువలన చాలా నమ్మకమైనవి.

అందువలన, మీకు నమ్మకమైన క్రిమిసంహారిణి కావలసి వచ్చినప్పుడు, మొక్కను చేతితో పట్టుకొన్న గుర్తుకొరకు చూసి, దేవిదయాల్ పేరు చెప్పి అడగండి.

దేవిదయాల్ ఈ క్రింది అనేక రకాల క్రిమిసంహారిణులను అందచేస్తున్నారు:
డిడిటి, బిహెచ్‌సి, ఎండ్రిన్, కాపర్ ఆక్సీక్లోరైడ్, సల్ఫర్, కార్బరిల్, టోక్సాఫీన్, పారాథియాన్, మలాథియాన్, క్లోర్‌డేన్, ఎండోసల్ఫన్, సిమజైన్, ఎట్రాజైన్, డైకోఫాల్, థలాపన్, డయాజినాన్, హెప్టాక్లోర్, డైమిథోయెట్, ఆల్‌డ్రిన్, ఎనిమోన్ (మొక్క హార్మోన్).

# దేవిదయాల్ ఎగ్రో కెమికల్స్

దేవిదయాల్ (సేల్స్) ప్రైవేట్ లిమిటెడ్ వారి ఒక విభాగము, రేరోడ్, బొంబాయి 400 010
శాఖలు : క్యామర్ మేన్షన్, 5-9-164 చాపెల్ రోడ్, మెథోడిస్ట్ చర్చ్ ఎదురుగా, హైదరాబాద్ ● 27-10-32, అట్ల రత్నయ్య స్ట్రీట్, గవర్నర్ పేట, విజయవాడ 520 002 ● లక్ష్మినివాస్, హౌస్ నం. 45/98 నరసింహారెడ్డి కాలనీ, రైల్వే స్టేషన్ దగ్గర, కర్నూల్.
ఇతర శాఖలు : బరోడా, ఢిల్లీ, కోయంబత్తూర్.

డిస్ట్రిబ్యూటర్లు:— ★మహాలక్ష్మి అగ్రో సర్వీసెస్, 26-1-90. ఓల్డ్ క్లబ్‌రోడ్, కొత్తపేట, గుంటూరు-522001 (ఏ.పి.) H.O. కాకుమాను—522112, గుంటూరుజిల్లా ★ జగిని లక్ష్మయ్య&సన్స్, తుల్జానగర్ రోడ్, పి.బి. బాక్సు నెం.14 నల్గొండ(ఆం.ప్ర.) ★ రవి అగ్రో ఏజన్సీస్, 8—12—52, జె.పి.ఎన్.రోడ్, వరంగల్ (ఆం.ప్ర.) ★ ఉషశ్రీ అగ్రో ఏజన్సీస్, గాంధీచౌక్, ఖమ్మం (ఆం.ప్ర.) ★ శ్రీ అనంతలక్ష్మి ఏజన్సీస్, కె.ఎన్. రోడ్, ప్రకాశం మున్సిపల్ మార్కెట్ సమీపం, తాడేపల్లిగూడెం, ప. గో. జిల్లా (ఆం.ప్ర.) ★ అరుణోదయా కమర్షియల్ కార్పోరేషన్, W5/320. స్టోన్‌హవున్‌పేట, నెల్లూరు—2 (ఆం. ప్ర.) ★ శ్రీ పార్థసారథి & కో. 43/4, బషీర్‌బాగ్, హైదరాబాద్—500001 (ఆం. ప్ర.) ★ కిరణ్ & కో, కరీంనగర్ (ఆం. ప్ర.) ★ కృష్ణారెడ్డి & కంపెనీ, కడప (ఆం. ప్ర) ★ వెంకట రమణప్ప, అనంతపూరు (ఆం. ప్ర).

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

## డాక్టర్ కె. ఎల్. రావు ఉత్తమ సూచన

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయంలో జులై 11న డాక్టర్ కె. ఎల్. రావు ప్రముఖ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ చిత్రపటం ఆవిష్కరిస్తూ శ్రీ శర్మగారి స్మృతి చిహ్నంగా విశ్వవిద్యాలయంలో ఒక పీఠం స్థాపించాలని చేసిన సూచన చాల ఉత్తమమయింది. శ్రీ శర్మ తెలుగు జాతి గత వైభవాన్ని తెలుగువారికి అర్ధ శతాబ్దిపాటు తెలియజేసి, అపూర్వ చరిత్రాంశాలు వెలువరించిన మహావిద్వాంసులు. ఆయన పేర మూడు విశ్వవిద్యాలయాలలోను శాసన పరిశోధన చరిత్ర పరిశోధన అధ్యయనాలకు ఆచార్య పీఠాలు ఉండడం అవసరం. విద్యామంత్రి శ్రీ మండలి కృష్ణారావు ఈ విషయంలో శ్రద్ధ తీసుకొంటే, ఈ పని చిటికలో అయిపోతుంది. ఈ చిత్రపటావిష్కరణ మహోత్సవానికి అధ్యక్షత వహించిన డాక్టర్ సి. నారాయణరెడ్డి శ్రీ శర్మ మృదు మధుర శైలితో శుష్క చరిత్రాంశాలను కావ్యాల వలె రచించినారని ప్రశంసించగా, అధికార భాషా కమీషన్ అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య "శ్రీ శర్మ రాళ్లను పలకరించి, విగ్రహాల యోగక్షేమాలడిగి, శాసనాలతో మాట్లాడేవాడు. ఆయన హృదయం నవనీతం" అని అన్నారు. "శ్రీ శర్మ దాదాపు 50 వేల పుటల వ్యాసాలు గ్రంథాలు వ్రాశారు. ఆ చరిత్ర తథాగతుడు మనకు ప్రసాదించిన అనర్ఘ రత్నాలు: (1) రెడ్డి కింగ్డం, (2) ఫర్గాటన్ చాప్టర్ ఇన్ ది ఆంధ్ర హిస్టరీ, (3) అర్ధనారీశ్వర ఇమేజు ఫ్రం ది మొగల్రాజపురం కేవ్స్" అని శ్రీ తిరుమల రామచంద్ర శ్రీశర్మ పరిశోధన ప్రాశస్త్యాన్ని వివరించారు. శ్రీ శర్మ వారసుడైన శ్రీ వీరభద్రనాగఆదిత్య శర్మ తమ తండ్రిగారి అపూర్వ విజ్ఞానాన్ని వినియోగించుకొని వారి అసమగ్ర రచనలను పూర్తి చేయాలని శ్రీ తిరుమల రామచంద్ర కోరారు. భాషా నిలయ కార్యదర్శి శ్రీ మాదిరాజు లక్ష్మీ నరసింహారావు వందన సమర్పణ చేస్తూ, ఈ గ్రంథాలయంతో సంబంధమున్న శ్రీ శర్మగారి చిత్రపటం నిలయంలో ఆవిష్కరిస్తున్నందుకు సంతోషం ప్రకటించారు.

## తాలూకాల్లో సూపర్ బజార్లు

ప్రతి తాలూకా ప్రధాన పట్టణంలోను సూపర్ బజార్లు నెలకొల్పబడడానికి ప్రభుత్వం నిశ్చయించిందని ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు జులై 14న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రకటించడం చాల బాగుంది. వస్తువులు ప్రజా సామాన్యానికి అందజేయడానికి ఇది ఉత్తమ మార్గమనడమూ నిస్సందేహం. కాని, సూపర్ బజార్లలో ఒకొకప్పుడు మంచి సరుకు రావడం లేదని, అక్కడి అధికారులు బంధుప్రీతికి బందీలైపోతున్నారని, అప్పుడప్పుడు వెలువడే వార్తలు ఆమ్రేడితం కాకుండా ప్రభుత్వం జాగ్రత్తపడడం అవసరం. సూపర్‌బజార్లు విస్తరించిన కొద్దీ ఈ ప్రమాదం ఉంది. కనుక బహుపరాక్. తాలూకాల్లో స్థానిక రాజకీయాలు, సరుకుల సరఫరాకు అడ్డు రాకూడదు కూడా.

## మరో నాలుగు సంగీత నృత్య కళాశాలలు

ఖమ్మం, మహబూబ్‌నగర్, కాకినాడ, నెల్లూరు పట్టణాలలో చెరి ఒక సంగీత నృత్య పాఠశాల నెలకొల్పబడాలనే సూచన ఉన్నదని జులై 11న సంఘ సంక్షేమ సాంకేతిక విద్యాశాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు. రాష్ట్రములో ఇదివరకు ఎనిమిది సంగీత నృత్య కళాశాలలు వేయిమంది విద్యార్థులకు బోధన చేస్తున్నవి. నూతన కళాశాలల్లో దేశంలో లుప్తమయిపోతున్న జానపద సంగీత నృత్య ప్రక్రియలను రక్షించే ప్రణాళిక ఉండడం అవసరం. క్రీడాభిరామంలో సూచితమైన అపూర్వ నృత్యాలు నేడు లుప్తప్రాయమై, ఆ కళాకారులు నేడు బిచ్చగాళ్లయి తిరుగుతున్నారు. పొరుగున ఉన్న కన్నడ రాష్ట్రం, జానపద కళల కొక మ్యూజియం స్థాపించి, రక్షించి ప్రోత్సహిస్తున్నది. అది మన కొత్త కళాశాలల వరవడి కావడం ఉచితం.

## బీడీ కార్మికుల వేతనాలు

బీడీ పరిశ్రమ పూర్తిగా కుటీర పరిశ్రమ. ఎక్కువగా ఆధారపడినవారు అనాథ స్త్రీలు. వీరి వేతనాన్ని పట్టణ ప్రాంతాలలో వేయికి 4—60 చొప్పున గ్రామ సీమలలో వేయికి 4—50 చొప్పున హెచ్చించినందుకు కార్మిక శాఖామాత్యులు శ్రీ టి. అంజయ్యగారిని ప్రశంసించక తప్పదు. దీనివల్ల రాష్ట్రంలోని అయిదు లక్షల మంది బీడీ కార్మికులకు ప్రయోజనం కలిగింది. వారందరి శుభాకాంక్షలు శ్రీ అంజయ్యగారికి దక్కాయి.

## ఉపశ్రుతి.

"ఏమిటి సార్, డస్ట్ బిన్నులకంటే, 'నగరాన్ని పరిశుభ్రంగా ఉంచండి' బోర్డులే చాల కనిపిస్తున్నాయే?" అని అడిగాను ఒక సుమారైన సంఘసేవకుణ్ని. ఆయన అన్నారు గదా, "డస్ట్ బిన్నులకు ఎక్కువ ధర చెల్లించాలి. ఒక డస్ట్‌బిన్ ఈస్ ఈక్వెల్ టు నాలుగు బోర్డులు" అని. ●

# "నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు.



**ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరీ నేప్‌కిన్‌లను గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!"**

**వండర్‌రాప్‌గల క్రొత్త కేర్ ఫ్రీ స్త్రీయొక్క దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.**

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేకమైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను తీసుకొనుటకు యిప్పుడు కేర్‌ఫ్రీ ఉంది.

కేర్‌ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్‌రాప్ తేమ్మను లోపలి పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్‌ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి తేమ్మను ఏకరీతిగా చేరేలా చేసే, ప్రత్యేకమైన పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది. అందువలన ఒకే చోటు తడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్‌ఫ్రీ వాడుకలో ఎంతో తేలికైనది. ఎందుకంటె, దానిని ఉపయోగించిన తరువాత సులభముగా 'ఫ్లష్' చేయవచ్చును. కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో చికాకు పడరు.

కేర్‌ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా సరిపోయేలా మార్చుకోగలిగే సైజులో లభిస్తోంది. ప్రతి ప్యాకులోను ఉచితముగా యివ్వబడే కేర్‌ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ మంచి వస్తువులు కావాలనే స్త్రీలకు క్రొత్త, మేలు రకపు, మార్చుకోగలిగే బెల్టు విడిగా అమ్మబడుతోంది. దానిని కేర్‌ఫ్రీ సానిటరీ నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి.




జాన్సన్ & జాన్సన్* స్త్రీలకు హాయియైన రక్షణకు

* Trade Mark © Johnson & Johnson India Ltd.

సీరియల్

# జీవేదం

## —— పోలాప్రగడ రాజ్యలక్ష్మి ——

*(గత సంచిక తరువాయి)*

''హల్లో దొడ్డమ్మా!'' అంటూ వచ్చి అమాంతం కౌగిలించుకున్న ఆ కొత్త రూపాన్ని చూసి మొదట కాస్సేపు కంగారుపడి తర్వాత స్తిమితపడి ఆప్యాయంగా నవ్వుతూ ''ఓస్! నువ్వంటే లీలా! ఏవిటే రావడం? ఎక్కడ నుంచి?'' అంటూ వెన్నుమీద చెయ్యివేసి నిమురుతూ పలకరించింది జోగమ్మ.

''మళ్ళీ రికార్డంతా పెట్టాలి కాబోలురా భగవంతుడా'' అనుకుంటూ, ప్రభాకరానికి చెప్పిందే టూకీగా జోగమ్మకీ చెప్పింది లీల. జోగమ్మ బుగ్గలు నొక్కుకుంటూ ''నిన్ను ఒక్కర్తినీ యిలా ఊళ్ళమ్మట ఎలా పంపాడే మీ నాన్న...హవ్వ...ఆ జుట్టేమిటే? వెర్రిపిల్లా!... ఇలా రా చక్కగా దువ్వి వాలుజడ వేస్తాను'' అంది.

లీల పకపకా నవ్వి ''ఇది యిప్పటి ఫేషన్ దొడ్డమ్మా! మా స్నేహితురాండ్రంతా యిలాగే వుంటారు'' అంది.

''రావుడూ!... అమ్మాయికి కాఫీ పట్రా... వంటావిడతో యీపూట బొబ్బట్లూ, పులిహోరా చెయ్యమను. ఎంత చిక్కిపోయావే మాతల్లీ! పదిరోజులు నాదగ్గర వుండు. మీ అమ్మ ఎలాగా లేదు. నిన్ను చూస్తే మీ అమ్మను చూసినట్లుంది'' అని జోగమ్మ అంటూండగా రావుడు కాఫీ పట్టుకొచ్చింది.

ఆమెని చూస్తూనే ''రావుడంటే ఇంకా మగ పిల్లాడు అనుకున్నాను నేనూ...'' అంటూ కాఫీ కప్పు నోటిదగ్గర పెట్టుకుంది లీల. ఇంతలో హాస్పిటల్లోంచి తలుపు తోసుకుని సీతాలు వచ్చి ''అమ్మగారూ! పట్నంనుంచి కొత్త డాక్టరమ్మ గారు వచ్చారట. వారికికూడా భోజనం ఏర్పాట్లు చేయించమన్నారు డాక్టరుగారు'' అంటూ చెప్పాడు.

''ఒరేయ్ సీతాలూ! అయితే, బజారుకెళ్ళి ఓ డజను చక్కెరకేళీలు కూడా పట్రా'' అంది జోగమ్మ.

తాగుతూన్న కాఫీ ఆమట్టునే వుంచేసి ఆశ్చర్యంగా చూస్తూ ''సీ...తా...లూ!...మగాడికి ఆడ పేరా?... చిత్రంగా వుందే! ఈ అమ్మాయికి మగ పేరూ, ఆ అబ్బాయికి ఆడ పేరూనా?'' అంది లీల.

వెంటనే సీతాలు ''దానికేవుందండి అమ్మగారూ! యీ రోజుల్లో, లాగులూ చొక్కాలూ తొడుక్కుని అమ్మాయిలూ, తెగబారెడు జుట్లు పెంచుకుని అబ్బాయిలూ తిరగడంలేదూ? పైగా కొందరు ఆడాళ్ళు మగాళ్ళకంటే జబర్దస్తీగా వుంటున్నారు'' అంటూ కొంటెగా రావుడుకేసి చూసాడు. రావుడు కోపంతో ముఖం చిట్లించుకొంది.

ఆ సన్నివేశం చూసి, కాఫీ కప్పు టేబిల్మీద పెట్టి చప్పట్లు కొడుతూ ''వండర్ఫుల్... ఇంత సహజమైన సంఘటనని ఏ సినిమాలోనూ చూడం... తప్పకుండా యీ ఇంట్లో రెండురోజులు వుండవలసిందే!'' అంది లీల.

''రెండురోజు లేవిటే...నెల్లాళ్ళపాటు నాదగ్గర అట్టేపెట్టుకుంటేనేకాని నిన్ను మీనాన్న దగ్గరికి పంపేదిలేదు.''

''నెల్లాళ్ళే!... హమ్మో... ఈలోగా ఎన్ని ప్రదేశాలు చూడొచ్చో తెలుసా?''

''ప్రదేశాలూ, ఊళ్ళూ చూస్తావా? మాకాలంలో వయసువచ్చిన పిల్లల్ని గడపదాటనిచ్చి ఎరుగుదురా?... ఏవిటో...ఇప్పుడిలా కారుల్లోనూ, రైళ్ళలోనూ దేశాలమ్మట జుట్టు విరబోసుకుని తిరుగుతున్నారుకాని... అయినా 'దొడ్డమ్మా నీదగ్గర పదిరోజులు వుంటానే' అనక పిచ్చిపిల్లలా ఊళ్ళన్నీ ఊరేగుతానంటావేమిటే!''

జోగమ్మ మాటలకి లీలేకాదు, రావుడూ, సీతాలూ కూడా నవ్వుకున్నారు. సీతాలు వెళుతూ వెళుతూ రావుడికి కళ్ళతో సంజ్ఞ చేశాడు. రావుడు నాలికతో వెక్కిరించింది. వాళ్ల నిద్దర్నీ చూస్తూ లీల తనలో తను నవ్వుకుని ''పిళ్ళవి ఎంత స్వచ్ఛమైన జీవితాలు!'' అనుకొంది.

> ***జరిగిన కథ 4 :*** భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్యగారి ఆస్తంతా దాన ధర్మాలతో హరించిపోయింది. అంకరాజు మిల్లులో గోడౌన్ కీపరుగా చేరతాడు మురళి. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు. ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు. ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి. ఉషని మద్రాసులోని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం. దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల.

''ఏవిటో కాలం మారిపోయింది'' అంటూ నిట్టూర్చింది జోగమ్మ.

''అవును దొడ్డమ్మా! పల్లెటూళ్ళో వుండిపోయావు కనుక నీకు తెలియడంలేదుకాని ఎన్ని మార్పులు వస్తున్నాయో తెల్సా?... ఉదాహరణకి మా ఢిల్లీలో నీ వయస్సులో వున్నవాళ్లు గౌనులు, ఎత్తు మడమల బూట్లూ వేసుకుని తిరుగుతారు'' అంది లీల.

''బాగానే వుంది నీవరస! పెద్దపిల్లవైనా చిన్నకబుర్లు పోలేదే!'' అంది జోగమ్మ. కాస్సేపు ఆ మాటా ఈ మాటా చెప్పుకుని, లీల మొహం కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చేసరికి, ''వంట అయింది అమ్మగారూ!... మీరు దేవుడికి నివేదన చేసుకోవచ్చు'' అంది వంటావిడ. జోగమ్మ బరంపురం చీర కట్టుకుని దేవుడి గదిలోకి వెళ్ళింది. హాల్లో లీల ఒక్కత్తే కూచుంది.

''అత్తయ్యగారూ... నే నివాళ పెందరాళే భోజనం చేసి పట్నం వెళ్లాలి... అక్కడో షావుకారు ఉద్యోగం ఇస్తాను ఇవాళ రమ్మన్నాడు'' అంటూ హాల్లోకి వచ్చాడు మురళి. లీల తలెత్తి అతనికేసి చూసింది.

పచ్చగా బొద్దుగా ఎత్తుగా ఉన్న దగ్గర దగ్గర పాతికేళ్ళున్న వ్యక్తి. తెల్లని లాల్చీ పైజమాలో ప్రొద్దుటే విచ్చుకొన్న మల్లెపువ్వులా ఉన్నాడు. బిరుసైన ఉంగరాల జుట్టూ, పల్చని లాల్చీలోంచి కనిపిస్తూన్న బనీను, గుండెలకి బిగుతుగా అమరి, ధృఢమైన అతని గుండెల్ని జబ్బల్ని దాచలేకపోతోంది.

తనకేసి ఆశ్చర్యంగా చూస్తూన్న ఈ కొత్త అమ్మాయి ఎవరా అని తెల్లబోయి నిల్చుండిపోయాడు మురళి.

ఇంతలో హాస్పటల్లోంచి తలుపు తెరుచుకొని, కొత్తగా వచ్చిన డాక్టర్ జానీతో కలిసి, హాల్లోకి వచ్చాడు ప్రభాకరం. మొహమాటంగా సిగ్గుతో అతని వెనకాల, లోపలికి వచ్చిన జానీ, లీల కంటికి ఎంతో అందంగా కనిపించింది. గులాబీ రంగు నైలెక్సు చీర, పల్చని ఆమె వంటికి అంటిపెట్టుకుని, అసలామె ఆ చీరతోటే పుట్టిందా అన్నట్లుంది. చిన్న పెదిమలూ, కొసదేలిన గడ్డం, కోల ముఖం నొక్కు నొక్కులుగా ఉన్న బారెడు జడా, చెప్పుల్లో మెరిసిపోతూన్న పచ్చని పాదాలూ — చూసేవాళ్ళని ఇట్టే ఆకర్షించేలా ఉన్నాయి. మెళ్ళో ఉన్న ఒంటిపేట గొలుసూ, చేతికి ఉన్న రోల్డుగోల్డు వాచీ, ఈ రెండే ఆమెకి ఎన్నో ఆభరణాలులా కన్పిస్తున్నాయి.

''ఈవిడ డాక్టర్ జానీ అని ఇవాళే కొత్తగా మా నర్సింగ్హోమ్లో జేరిన డాక్టరు. ఈమె మా కజిన్ లీల. ఢిల్లీలో బి. ఏ. చదువుతోంది. ఇతను నాకు ఎంతో ఆత్మీయుడైన మిత్రుడు. మంచి ఆర్టిస్టు...మురళి...ఇతనే లీలా, నువ్వు కలుసుకోవాలన్న ఆర్టిస్టు'' అంటూ ప్రభాకరం ఒకళ్ళ నొకళ్ళకి పరిచయం చేశాడు.

లీల ఆశ్చర్యంగా అటు తిరిగి మురళికేసే, కన్నార్పకుండా చూస్తూ వుండిపోయింది. దేవ

గదిలోంచి జోగమ్మ వచ్చాక ప్రభాకరం, జానీని తల్లికి పరిచయంచేసి "ఇవాళ్టినుంచి ఈవిడ మనింట్లోనే వుంటారు" అన్నాడు. "తప్పకుండా అలాగే వుండమ్మా! నువ్వేం మొహమాటం పడక్కర్లేదు. నీ స్వంత యింట్లోలాగ వుండొచ్చు" అంది జోగమ్మ. ఆమె ఆత్మీయత చూసి ఆశ్చర్యపోయింది జానీ.

ప్రభాకరం, మురళీ, లీలా, జానీ నలుగురూ భోజనం చేస్తున్నప్పుడు దగ్గరగా కూర్చుని అన్నీ వడ్డింపిస్తూ, కొసరి కొసరి వేయిస్తూ, జోగమ్మ ఒక్క ప్రభాకరానికేకాదు, తక్కిన ముగ్గురికీ కూడా తల్లిలా అనిపించింది. భోజనాల దగ్గర, పట్నంలో తనకి వచ్చిన కొత్త ఉద్యోగం సంగతి ఎత్తాడు మురళి. "ఆ ఉద్యోగం సంగతి తర్వాత చూద్దాం. ఇంతోటి కోమటి గుమాస్తా ఉద్యోగం; అది పోతే దాని తలదన్నే మరో మంచి ఉద్యోగం నేను చూస్తానుకాని, నువ్వు ముందు పట్నం వెళ్ళి అక్కడ మా లీల సామాన్లు ఉన్నాయిట, అవి తీసుకురా. ఎడ్రస్ యిస్తుంది" అన్నాడు ప్రభాకరం.

మురళి అదికాదంటూ ఏదో చెప్పబోయేంతలో లీల కూడా "నా మాట విను అన్నయ్యా... మాటుకి నన్ను పోనీ... ఇంకోమాటు వచ్చి నాలుగు రోజు లుంటాను" అంది. కాని ప్రభాకరం వాళ్ళ మాటలేం వినిపించుకోకుండా "నాకు అవతల అర్జంటు కేసు లున్నాయి." అంటూ చెయ్యి కడుక్కొని జానీతో కలిసి హాస్పటల్లోకి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం భోజనం చేసి జోగమ్మ నడ్డి వాల్చాక, లీలకి ఏం తోచలేదు. ఆ గదిలోకీ ఈ గదిలోకీ పచార్లు చేస్తూ, మధ్య మధ్య మురళి రూపాన్ని జ్ఞాపకం చేసుకుంటూ కాలక్షేపం చేస్తోంది. పది నిముషాలయి మురళి వచ్చి, ఎదురుగుండా నిలబడ్డ సంగతి కూడా గమనించలేదు. చివరకి మురళి కొంచెం దగ్గి గొంతు సవరించుకుంటూ "ఎడ్రస్ ఇస్తారా?... ఆ సామాన్లు నాకు ఇస్తారో లేదో? ఓ చీటీ కూడా రాసివ్వండి" అన్నాడు.

లీల అతని కేం సమాధానం చెప్పకుండా కన్నులు మరింత పెద్దవి చేసి అతన్ని చూస్తూ ఉండిపోయింది. మురళి ఇబ్బందిగా కదిలాడు. చాలా సేపటి వరకూ ఎవరూ మాట్లాడలేదు. తర్వాత, లీలే, తనని తాను సంబాళించుకుంటూ "ఇవాళ మీలాంటి ఆర్టిస్టుని చూశాను. చాలా సంతోషం" అంది. మురళి మాట్లాడలేదు.

"ఇంత ఆర్టు వుండి మీరీ పల్లెటూళ్ళోనే వుండిపోవడం ఏమిటి?" అంది. మురళి నవ్వాడు.

"మీరు వేసే బొమ్మలులాగే మీరుకూడా మౌనమా?"

"అబ్బే... అదేంలేదు."

"హమ్మయ్య... అందమైన బొమ్మ మాట్లాడితే ఎంత బాగుంటుంది!" అంది లీల. మురళి సిగ్గుపడ్డాడు. 'సిగ్గు పడినప్పుడు ఆడపిల్లలా ఎంత అందంగా ఉన్నాడు' అనుకొంది లీల.

మళ్ళీ కాస్సేపు నిశ్శబ్దం.

"మీ సంధ్యాదేవి కళ్యాణ వేదిక చాలా బాగుంది. అదే కొందాం అనుకున్నాను. కాని అది అమ్మేది కాదు అన్నారు. అందుకే సగటు మనిషి కొన్నాను."

"ఓహో!... అయిదు వందలిచ్చి ఆ చిత్రం కొన్నది ఈమె అన్న మాట!" అనుకున్నాడు మురళి.

"ఆ కళ్యాణ వేదిక ఐడియా అసలు మీకు ఎలా వచ్చిందండీ!" కుతూహలంగా అడిగింది లీల.

"అ లా భావన నాది కాదండీ—మా చెల్లెలిది. అది వెయ్యమని ఒక గొడవ చేస్తే నే వేశాను. నిజానికి నేను స్వతహాగా పరమ బద్ధకస్తుణ్ణిలెండి."

"ఆర్టిస్టు లందరూ అంతే... అది సరే... అంత చక్కని భావనని అందించిన ఆవిడని ఓమారు చూడాలి."

"ఇక్కడ లేదు. ప్రస్తుతం మద్రాసులో ఉంటోంది."

"అలాగా? ... మళ్ళీ కొత్త బొమ్మ లేవైనా వేస్తున్నారా?"

"మా చెల్లెలిలాగ ఎవరేనా పక్కనుండి పోరితేనే కాని నేను వెయ్యలేనండీ!"

"భలేవారే! అస్తమానూ పక్కన వుండి ఎవరు ప్రోత్సహిస్తారు? ఇంకా పుణ్యంకట్టుకొని మరో కొన్ని మంచి చిత్రాలు మీ కుంచెలోంచి రచింపజేసే బాధ్యత మీ శ్రీమతిగారు వహించాలి."

"నాకింకా పెళ్ళికాలేదు."

లీల ఆశ్చర్యంగా చూసింది.

ఆరోజు పట్నం వెళ్ళి లీల సామాన్లు అన్నీ పట్టుకొచ్చాడు మురళి. అప్పటినుంచి ప్రతిరోజూ అవకాశం దొరికినప్పుడల్లా మురళి గదిలోకి జేరి, చిత్రలేఖనానికి సంబంధించిన ఎన్నో వివరాలు అడిగి తెలుసుకోసాగింది లీల.

ప్రపంచంలో వస్తువులన్నీ రేఖా నియమాల్ని పాటించడంవల్లే, ఒకదానికొకటి భిన్నం అనే జ్ఞానం మనకి కలుగుతోందని మురళి చెప్పినపుడు ఆశ్చర్యంగా వింది లీల. 'మానవ శరీరం భగవంతుడు సృష్టించిన ఒక ఉత్తమ కళాఖండం' అనే మాట మురళి నోట విన్నప్పుడు 'నిజమేసుమా!' అని ... సాధారణంగా చిత్రకారులు పెన్సిల్



## యువతరం

మన ఆర్థిక దుస్థితికి అధిక 'జనాభా' కారణం అంటే ఒప్పుకోనంటున్నాడు కంఠమనేని శ్రీరామచంద్రరావు కెమిస్ట్రీ బి. ఎస్‌సి. పరీక్షలు రాసిన తరువాత మాట్లాడుతూ యీ విద్యా విధానం ఏం బాగులేదు. అందుకే నాకు పై చదువులమీద యింటరెస్టు లేదు. కుదరవల్లి వాళ్ళ వూరు. వ్యవసాయం చేయడం మేలు అనుకుంటున్నాను అన్నాడు. మనవాళ్ళల్లో సోమరితనం, అవినీతి రెండూ ఎక్కువ. అదే మన ఆర్థిక దుస్థితికి, అధిక ధరలకీ కారణం. ఈ బద్ధకం యిలాగే వుంటే జనాభాని సగానికి సగం తగ్గించేస్తే మాత్రం — "ప్చ్! ఈ దేశం బాగుపడుతుందటారా? — పడదు" అన్నాడు. జాతీయ సేవా సంస్థ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్న యీ యువకునికి [21 సం.లు.] 'క్రికెట్' ఆట సోమరితనానికి చిహ్నం అని నమ్మకం. శ్రీరామచంద్రరావు లయోలా కాలేజీ విజయవాడ విద్యార్థి. హాకీ జాతీయ క్రీడ అన్న వైనం తెలియదన్నాడు. కాని రాజకీయాలమీద దిట్టంగా మాట్లాడుతున్నాడు.



సినిమా తారలా? వారిని చూడ్డానికి పడిచచ్చేవారంటే వచ్చే కోపం వస్తుంది అతనికి. సాహిత్య పఠనం, రేడియో శ్రవణం హాబీలు. పాత సినిమాలు, నాటకాలు కాలక్షేప సాధనాలు!

డిగ్రీలు ఉద్యోగం కోసం మాత్రమేకాక ఉన్నత విద్యాగంధం కోసం అన్న విషయం అవగాహన చేసుకున్న యీ కె. ఆర్. రావు పల్లె పట్టున పని చేస్తే మంచిదేగా...

[సిరాజ్]

## గాజు మేడ

డ్రాయింగ్‌తో ప్రారంభించి, ఛార్‌కోల్ డ్రాయింగు అభ్యసించేసి, ఇండియన్ ఇంక్ పెయింటింగ్‌లో సిద్ధహస్తులయాక వాటర్ కలర్స్ వాడతారనీ, ఆ తర్వాతే ఆయిల్ పెయింటింగ్ ప్రయత్నిస్తారనీ మురళి చెబుతూంటే, 'ఈ కళ వెనక ఇంత తపస్సు ఉంది అన్న మాట!' అంటూ విస్తుపోయింది లీల.

రోజు రోజుకీ లీలా మురళి దగ్గర కావడం, లీల పట్ల మురళికి ఆసక్తి పెరగడం, మధ్య మధ్య లీల మురళి మీద జోక్స్ వేస్తూ ఉండడం ఇదంతా గమనించి "పోనీ ఇతణ్ణి నీతో తీసికెళతావేమిటి? అమరావతి, నాగార్జున, హంపీ శిల్పాలు ఇతనితో కలిసి చూస్తే ఇంకా బాగా 'ఎంజాయ్' చెయ్యవచ్చు. నీకూ కంపెనీ ఉన్నట్లుంటుంది. ఇతనికీ ఆ శిల్పాలన్నీ చూడ్డంవల్ల కొంత ఉపయోగం ఉంటుంది" అన్నాడు ప్రభాకరం.

"నిజంగానా?... ఏమండీ మీరు వస్తారా?" అంటూ ఆసక్తిగా అడిగింది లీల.

మొదట రానన్నాడు. తర్వాత నా ఉద్యోగ ప్రయత్నమో అన్నాడు. ఆఖర్ని ఇప్పుడు నేనెందుకు, మీరు వెళ్ళిరండి అన్నాడు మురళి. కాని చివరకి ప్రభాకరం బాగా నచ్చచెప్పాక, లీల బతిమాలి, మీరు రాకపోతే వీల్లేదని పట్టుబట్టాక, సర్లెండి అంటూ ఒప్పుకున్నాడు. మురళితో కలిసి టూర్ వెళుతున్నందుకు లీల ఎంతో పొంగిపోయింది. ఏవేవో తియ్యని ఊహ లోకాల్లో తేలిపోయింది.

### 7

ఆంధ్రదేశంలో ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళో పుట్టి పెరిగి, ఇంత దూరంలో యీ మహాపట్నంలో ముఖం ఎరగనివాళ్ల మధ్య ఒంటరిగా వుండాలనే ఆలోచన వచ్చేసరికి కొత్తలో ఉషకి గుండె దడదడలాడింది. అందుకే తనని ఆ ఆంధ్ర మహిళా సభలో చేర్చి అన్నయ్య తిరిగి వాళ్ళ వూరు వెళ్లిపోతున్నప్పుడు "నేనిక్కడ వుండలేను అన్నయ్యా! నీతో వచ్చేస్తాను. నాకు చదువూ వద్దు ఏం వద్దు" అంటూ భోరున ఏడ్చేసింది.

వెళ్ళబోయేవాడల్లా ఆగి "ఇలా చూడమ్మా! నేను అటూ యిటూ ఉద్యోగాలకని పోతూంటే ఈ వయస్సులో నువ్వు ఒంటరిగా ఇంట్లో వుండటం మంచిదికాదనీ, పల్లెటూళ్ళు అసలే అధ్వాన్నంగా తయారయాయి అనీ, పైగా యీ రోజుల్లో ఆడపిల్లకి పెళ్లి కావాలంటే మెట్రిక్యులేషన్ పేస్ కావడం అయినా కనీసపు అర్హత అనీ, ఇలా మనం ఎన్ని ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నాం చెప్పు! ఒక్కత్తెవీ వుండాలని బెంగేమిటి? నీకంటే చిన్నా పెద్దా ఎంతమంది ఆడవాళ్లు ఇక్కడ వుంటున్నారో చూడు. మనకి బెంగేమిటమ్మా మొండివాళ్లం. అమ్మా నాన్నా పోతేనే మనం బెంగపడిపోలేదు. ఇలా వున్నాం. హాయిగా రెండుపూట్లా తింటూ నవ్వుకుంటూ" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు మురళి.

ఉష వెంటనే కళవళపడి తనని తాను స్థిమితపరుచుకొని, అన్నయ్య కళ్ళు తుడిచి "సర్లే అన్నయ్యా! ఉంటాను. కాని నువ్వు వారానికో ఉత్తరం రాస్తూ ఉండాలి." అంటూ షరతు పెట్టింది. మురళి నవ్వి "ఒకటేమిటి రెండు రాస్తాను సరా?" అని బయలుదేరాడు. తీరా అతను వెళ్ళేటప్పుడు ఉషకి మళ్లీ కన్నీళ్ళు ఆగలేదు. జమునాబాయిగారు వెన్నుమీద చెయ్యి వేసి తల్లిలా ధైర్యం చెప్పారు... అయినా ఒకటి రెండు రోజులు దాకా ఉష మనస్సులో బెంగ ఆ పళంగానే ఉండిపోయింది.

తర్వాత నెమ్మదిగా ఆ వాతావరణానికి అలవాటుపడి, బెంగ తగ్గి సరదాగా ఉండసాగింది. వారానికి కాకపోయినా పది పదిహేను రోజులకయినా మురళి దగ్గర్నుంచి ఉత్తరం వస్తోంది. ప్రభాకరం జోగమ్మగారి కబుర్లతో సహా ఊళ్ళో జరుగుతూన్న ఎన్నో సంగతులు కలిపి మొదట్లో పెద్ద ఉత్తరాలే రాసేవాడు. రాను రాను కార్డులు రాస్తూ అవికూడా ఏ నెలకో ఒకటి వస్తూ ఉంటే, విశేషాలు ఏముంటాయి అందుకే ఇలా రాస్తున్నాడు అంటూ సరిపెట్టుకోసాగింది ఉష.

దానికి తోడు ఆంధ్ర మహిళా సభలో జీవితం ఆమెకి కొత్తగా, ఉత్సాహపూరితంగా, క్షణం తీరిక లేకుండా గడవసాగింది. ఆరు నెలల్లో జరగబోతున్న థర్డ్‌ఫారం పరీక్షకి కట్టింది. ఖాళీ సమయాల్లో వీణాభ్యాసం, కాస్త తీరిక చిక్కితే ఇండస్ట్రియల్ సెక్షన్‌కి వెళ్లి మిషను నేర్చుకోవడం. ఇదికాక రోజూ ఉండే కార్యక్రమం సరేసరి...

మహా ధనవంతుల అమ్మాయిల దగ్గర్నుంచి పరమ దరిద్రుల పిల్లలదాకా అన్ని అంతస్థులలో ఆడపిల్లలూ తరతమ భేదాలు మరచి అక్కడ జీవించడం ఉషకి ఆశ్చర్యం కలిగించింది. ఈ వయస్సులో తనకి చదువేమిటి అనుకొందికాని చూస్తే తనకంటే చాలా పెద్దవాళ్ళే చదువుతున్నారు థర్డ్ ఫారానికీ, మెట్రిక్‌కీను.

అంతా పొద్దుటే లేవడం, ఎవరి పనులు వాళ్లు పూర్తిచేసుకుని ఎవరి గ్లాసులు వాళ్ల పట్టుకుని, మెస్‌కి వెళ్లి కాఫీలు పోయించి తెచ్చుకోవడం, చదువుకునేవాళ్లు చదువుకోవడం, క్లాసుకి ప్రిపేర్ అయేవాళ్లు ప్రిపేర్ కావడం. ఉదయంపూట మాంచి సందడిగా వుండేది. పదిగంటల దగ్గర్నుంచి సాయంత్రందాకా సరే సరి; క్లాసులూ, పాఠాలూ, నవారు అల్లడం, కుట్లు నేర్చుకోవడం, యిలా సమయం యిట్టే గడిచిపోయేది. సాయంత్రంపూట, ప్లే గ్రౌండు అంతా చైతన్యవంతమే, నవ్వుల సందడే, రంగుల నాట్యమే. పదిహేను రోజులకో నెలకో ఒకమాటు వార్డెన్, దగ్గరుండి ఒక్కొక్క సెక్షన్ అమ్మాయిలనీ సినిమాకి తీసికెళ్లేది.

డబ్బున్నవాళ్లు ఖర్చుపెట్టుకొనేవారు, జీతాలూ కట్టేవారు. లేనివాళ్లు రెండే రెండు జతలతో కాలక్షేపం చేస్తూ, తమ బట్టల్ని తామే ఉతుక్కొని ఆరేసుకుంటూ, ఉచిత భోజన వసతులు పొందుతూ, స్కాలర్‌షిప్పులతో కాలక్షేపం చేసేవారు. తను మాత్రం లేదపిల్ల కాదూ, ఎంత అభిమానంతో ఉదారంగా పంపిస్తూంటే మాత్రం ప్రభాకరం చేస్తూన్న సహాయంతో డబ్బున్న పిల్లలా ఎందుకు బతకడం? అందుకే ఉష రెండు మూడు నెలలు పోయాక ఓ రోజున జమునాబాయిగారితో తన పరిస్థితి చెప్పింది. ఆవిడ "అలాగే నమ్మా! మీకేమీ ఆస్తిపాస్తులు లేవని కరణం, మునసబులచేత సంతకం చేయించి తహసీల్దారు ముద్ర వేయించి, ఓ కాగితం పంపించమను మీ అన్నయ్యని. నీకూ ఉచిత భోజనం స్కాలర్‌షిప్పూ అవీ ఏర్పాటు చేయిస్తాను" అన్నారు

ఆ విషయమే ఉష మురళికి రాస్తే, మురళి సమాధానం రాశాడు. "ప్రభాకరం యిది విని కోపగించుకున్నాడనీ, జోగమ్మగారు కూడా "ఏం, మేము యీమాత్రం సాయం చెయ్యకూడదా? ఎవరిమీదా ఆధారపడకుండా ఎవరితోటీ సంబంధం లేకుండా వుండాలనుకుంటుంటోందేమిటి?" అని

(28వ పేజీ చూడండి)

# దగ్గులను కొట్టిపడవేయు ఛాంపియన్

Alembic




**గ్లైకోడిన్** వలె దగ్గులను కొట్టిపడవేయగల గృహవైద్యం మరొకటి లేదు. దగ్గులను 4 స్థలాలలో— అనగా మెదడు, గొంతు, రొమ్ము, ఊపిరితిత్తులలో— ఎదుర్కొని శీఘ్రమే ఉపశమనాన్ని యిస్తుంది • ఇది త్వరగా పనిచేస్తుంది • రుచికి మధురం • మరియు పొదుపు.

గ్లైకోడిన్— లక్షలాది ప్రజలు 40 ఏళ్లుగా నమ్ముకొన్నది.

everest/617r/ACW-tl

## ☸ సినిమా విశేషాలు ☸

### వర్ధమాన తార జయసుధకు ఇష్టమైన 8 వెండితెర వెలుగులు



**ఉత్తమ వ్యక్తి !**

శోభన్‌బాబుగారి లాంటి వుత్తమ వ్యక్తిని చూడడం తన అదృష్టంగా భావిస్తున్నది, ''సోగ్గాడు'' చిత్రంలో అతగాడి సరసన నటిస్తున్న జయసుధ. ఆయనలో అహంకారంగాని, అహంభావం గాని అణువయినా లేదన్నది జయసుధ అభిప్రాయం.

**అలాంటి నటి ఎవరు ?**

వాణిశ్రీగారివలె నటించగల నటి యిప్పట్లో వస్తుందా అనేడి సందేహాన్ని వెలిబుచ్చింది, జయసుధ. ''హర్ యాక్టింగ్ ఈజ్ సింప్లీ సుపర్బ్'' అంటుంది వర్ధమాన తార.

**అన్యులకు సాధ్యమా ?**

జమునగారివలె యిరవై అయిదేండ్లు హీరోయిన్‌గా పలుకుబడి సంపాయించడం అన్యులకు సాధ్యమా అంటూ, ఆమె పట్ల తనకు గల ప్రత్యేక అభిమానాన్ని వ్యక్తపరిచింది.

**"తన గొడవే తనది"**

రామకృష్ణగారు తన గొడవ తప్ప, మరొకరి విషయంలోగాని, అనవసర సంభాషణంలోగాని పాల్గొనకపోవడం జయసుధను ఆకర్షించింది.

**'ఖుషీగా వుంటాడు'**

ఇక చంద్రమోహన్ అంటారా... ఆయనతో వుంటె, గంటలు నిమిషాల్లాగా దొర్లిపోతాయి బలే ఖుషీగా వుంటారాయన, అంటూంది అందాల అతివ

**దుర్లభమైన నటి**

''పెపుకారు'' జానకిగారిని బోలిన క్యారెక్టర్ నటి దొరకడం దుర్లభం అన్నది నిజమేకదా అని ప్రశ్నిస్తుంది

**నాచురాలిటీ !**

గుమ్మడిగారంటె జయసుధకు చాలా యిష్టం. ఆయన నటనలో నాచురాలిటీ వుంటుదట

**బాక్సాఫీస్ హీరో !**

డి వి. ఎస్. రాజుగారి ''జీవనజ్యోతి'' వర్ణ చిత్రం సాంఘిక చిత్రాల్లో కని, విని, ఎరుగని వసూళ్ళను ఆర్జించిపెట్టి, కొత్త రికార్డును సృష్టించింది ఈ చిత్రంలో హీరోగా నటించిన శోభన్‌బాబు వుత్తమ నటున్ని ప్రదర్శించిన నిజాన్ని ప్రేక్షకులు అంగీకరిస్తూ, ఆయనకు వుత్తరాల వర్షం కురిపించారు

అత్యధిక- వసూళ్ళను తెచ్చిపెట్టిన చిత్రానికి కథానాయకుడుగా నటించిన శోభనబాబుకు కొత్త బిరుదు నివ్వడానికి సంశయించ [illegible]



"పూజ"లో వాణిశ్రీ

## విజయవాడ దగ్గర కృష్ణ 'స్టూడియో'

విజయవాడకి సమీపంలో కృష్ణకి అవతలి తట్టున్న గుంటూరు జిల్లాలోని సీతానగరం మున్నగు కొన్ని ప్రాంతాలను యీమధ్యనే హీరో కృష్ణ రాష్ట్ర మంత్రులు కొందరికి చూపించి స్టుడియో నిర్మాణానికి అనువైన ప్రాంతం ఒకదానిని తనకు కేటాయించమని ప్రభుత్వాన్ని కోరారు. స్థలం మంజూరు కాగానే, స్టుడియో నిర్మాణం ప్రారంభించగలమని పత్రికంవారికి యీ నటుడు చెప్పారు. కృష్ణ ఆధ్వర్యంలో స్టుడియో నిర్మాణం జరుగుతే దాని ప్రక్కనే తనకుకూడా ఓ స్టుడియో కట్టడానికి జాగా మంజూరు చేయమని హాస్య నటుడు రాజబాబుకూడా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసినట్లు యీ పత్రికా ప్రతినిధుల సభలోనే పేకేటి శివరాం చెప్పారు

### ఆర్. కె. ఆర్ట్ ప్రొడక్షన్స్ !

ప్రముఖ కథా రచయిత, సినిమా రచయిత పాలగుమ్మి పద్మరాజుగారి "నల్లరేగడి"ని వర్ణ చిత్రంగా నిర్మిస్తున్న సంస్థ యిది. ఈ సంస్థకు రామచంద్రరావు అధినేత. ఈ చిత్రానికి హేమాంబరధరరావు దర్శకుడు.

"నల్లరేగడి" ఆధారంగా నిర్మింపబడుతున్న చిత్రంలో కృష్ణ, జయప్రద, రోజారమణి, నిర్మల, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, గోకిన రామారావు, రూప్సీ ప్రధాన తారాగణం.

ఈ చిత్రానికి గోపీ రచన్ను, గోపీకృష్ణ ఛాయను, బి. ఎన్. కృష్ణ కళను, రాఘవులు సంగీతాన్ని నిర్వహిస్తున్నారు.

ఆగస్టు నుంచి ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాలలో యీ చిత్రం తాలూకు షూటింగు జరుగగల దన్న వార్తను, నిర్మాత చెప్పారు.

ఈ చిత్రంలో రోజారమణి పోషిస్తున్న "మల్లి" పాత్రకు విశిష్టత వున్నది

### హిమాలయాలలో ఆరాధన

భాస్కర చిత్రవారి "ఆరాధన" వర్ణ చిత్రం షూటింగు "కులు" వ్యాలీలోనే గాక, హిమాలయాలలో కూడా జరిగిన విజాన్ని, పుండరీ కాశయ్యగారి కలర్ ఫొటో ఆల్బం వెల్లడిచేసింది.

అక్కడి లోకేషన్ గూర్చి రాయాలంటె, ఒక ప్రత్యేక పుస్తకాన్నే తయారు చెయ్యొచ్చు. "కులు" షూటింగు ఖర్చు రెండు లక్షలు అయ్యేటుంది అని భాస్కర చిత్ర అధినేత అన్నది తక్కువేమో అన్నంతగా అక్కడి సుందరతర దృశ్యాల ఛాయా చిత్రాలు తెలిపాయి.

"గీత్" చిత్రం యిచ్చిన ఎఫెక్ట్‌కు మించిన రిజల్ట్‌ను "ఆరాధన" చిత్రం యివ్వగలదు. రఫీ పాడిన ప్రతి పాట వరహాల మూట అనక తప్పదు. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు.

"కులు" ప్రాంతపు చలిని, మన రామారావు, వాణిశ్రీ, జగ్గయ్య, విజయలలిత, గుమ్మడి ఎలా భరించగలిగారో ?

జనామోదాన్ని పొందగల అంశాలు దండిగా వున్న "ఆరాధన" చిత్రం ధన వర్షాన్ని కురిపించ గలదు.

### "లక్ష్మిలాగే నేనూ"

లక్ష్మిగారివలె తను కూడా పేరు, ప్రతిష్టలు సంపాదించాలన్న ఆశ జయసుధకు బలంగా వున్నది.

### విజయనిర్మలకి థాంక్స్

తను నటిగా రంగ ప్రవేశం చెయ్యడానికి అవకాశం కల్పించిన "ఆంటీ" విజయనిర్మలకు పత్రికా ముఖంగా కృతజ్ఞతలు తెల్పుకుంటూ, "లక్ష్మణరేఖ" చిత్రంలోని తన పాత్ర పోషణకు ప్రేక్షకుల న్యాయమైన తీర్పును అర్థిస్తున్నది.

### 'గ్లామర్ రాణి జయసుధ'

జయసుధను "గ్లామర్ రాణి"గా పేర్కొన వచ్చు. ప్రస్తుతం "లక్ష్మణరేఖ, సోగ్గాడు, క్షేత్రయ్య, కోటలోపాగా, వింత యిల్లు—సంతగోల" చిత్రాలలో జయసుధ ప్రధాన పాత్రలను పోషిస్తున్నది.

తమిళంలో నాలుగు, హిందీలో ఒకటి, మలయాళ చిత్రాలు కొన్ని జయసుధకు వున్నాయి.



బాక్సాఫీస్ హీరో అని సంబోధిస్తున్నారు.

ప్రముఖ చిత్ర నిర్మాత డి. వి. ఎస్. రాజుగారు త్వరలో ప్రారంభించే చిత్రంలో శోభన్, కె. విశ్వనాథ్, మహదేవన్ తథ్యము.

### అట్లూరి హనుమంతరావు చిత్రంలో శోభన్

"హీ—మాన్" తో చిత్రాన్ని తలపెట్టిన కొత్త నిర్మాత అట్లూరి హనుమంతరావుగారికి, విక్టరీ మధుసూదనరావు దర్శకత్వాన్ని అంగీకరించారు. ప్రస్తుతం కథాన్వేషణ జరుగుతూ వుంది. హీరోయిన్‌గా కొత్త అమ్మాయి నటించే అవకాశం లేకపోలేదు.

### ఏ. వి. ఎమ్‌లో శోభన్ !

మంచి చిత్రాలను అందించే సంస్థగా ఏ. వి. ఎమ్. సంస్థకు ప్రేక్షకుల్లో పలుకుబడి వుంది. ఆ సంస్థ నిర్మించబోయే సాంఘిక చిత్రంలో శోభన్ నాయకత్వం వహించగలరని తెలిసింది. శోభన్ — మంజుల ప్రధాన జంటగా నటించే ఆ చిత్రానికి మురుగన్, కుమరన్ దర్శకులుగా వుండగలరని తెలిసింది.

### కోటలోపాగా

విఠల్ ప్రొడక్షన్స్ వారి "కోటలో పాగా" జానపద చిత్రం షూటింగు జూన్ 26 న ప్రారంభమైన విషయం పాఠకులకు తెలుసు.

ఆ చిత్రంయొక్క రెండవ షెడ్యూలు జులై 19 న ప్రారంభమైంది. వరుసగా యిరవై తొమ్మిది రోజులు షూటింగు జరగగలదని, దర్శకుడు విఠలాచార్య చెప్పారు. కథక నిర్మాత ఆయనే.

### జయసుధ ద్విపాత్రాభినయం

"కోటలో పాగా" చిత్రంలో రామకృష్ణ మంత్రి కుమారుడుగా నటిస్తున్నారు. అన్యాయాన్ని అరికట్టే వీరుడి పాత్ర ఆయనది.

ఇప్పుడిప్పుడే పైకి వస్తున్న జయసుధ ద్విపాత్రాభినయం చెయ్యడం గమనార్హం. సహాయ పాత్రలను రాజబాబు, మిక్కిలినేని, ముక్కామల, రాజనాల, సుదర్శన్ పోషిస్తున్నారు. వాంప్ పాత్రను రాధాసత్యప్రియ పోషిస్తున్నది.

చాలాకాలం తరువాత ఆచార్య నుంచి వచ్చే జానపదం జనామోదం పొందగలదు.

"పెళ్లికాని తండ్రి"

# సినిమా



"విజయభట్ ప్రొడక్షన్స్"వారి చిత్రంలో కృష్ణకుమారి, కాంతారావు

## ఆగస్టు 13న అన్నపూర్ణ స్టుడియో

ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందగలదనెడి ధృఢ విశ్వాసంతో ఏనాడో భాగ్య నగరానికి తన మకాం మార్చిన ధీశాలి అక్కినేని యీనాడు స్టుడియో నిర్మించడానికి నిర్ణయించడం కొత్త చరిత్రనే సృష్టించగల దనడం తథ్యం.

అక్కినేని నాగేశ్వరరావు తలపెట్టిన "అన్నపూర్ణ స్టుడియోస్"కు ఆగస్టు 13న అంకురార్పణ జరుగుతుంది అని, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌లో అక్కినేనిని కలిసినప్పుడు, ఆయనే చెప్పారు

### "జనవరికి సిద్ధం"

రాబోయే జనవరి నాటికి రెండు ఫ్లోర్లు రెడీ అవుతాయని చెప్పి. తను కొన్న స్టుడియో సామగ్రిని చూపించారు ఏదేని కార్యం తలపెట్టాలేగాని, దాన్ని నిమిషాల్లో పూర్తి చెయ్యగల శక్తిని, అక్కినేని వరంగా పొందారు.

### క్షేత్రయ్య పాత్ర ఎంపిక !

"మహాకవి క్షేత్రయ్య" చిత్రాన్ని అంగీకరించ డానికి గల కారణాలను సోదాహరణంగా ఆయన వివరించారు. బాక్సాఫీస్ అంశాలు నిండిన చిత్రం "క్షేత్రయ్య" అనెడి నిజం, అక్కినేనిగారి విశదీకరణ వెల్లడించింది.

పండితులకు, భక్తులకు, యువతీ యువకులకు, సామాన్య జనులకు నచ్చేవిధంగా "క్షేత్రయ్య" పాత్ర వుంటుంది అని అక్కినేని వివరించినదాంట్లో నిజం కనిపించింది.

### క్షేత్రయ్య

జులై 15న బెంగుళూరు చాముండేశ్వరి స్టుడియోలో "మహాకవి క్షేత్రయ్య" షూటింగు ప్రారంభమైంది ప్రతి నెలా పక్షం రోజులు చొప్పున అక్కినేని కాల్‌షీట్లు యివ్వడం జరిగింది. అక్టోబరు కల్లా యిన్‌డోర్ పూర్తవుతుంది. నవంబరులో "పాచ్" వర్క్, రీ-రికార్డింగ్ పనులు పూర్తిచేసి, సంక్రాంతి కానుకగా విడుదల చెయ్యాలన్న వుద్దేశ్యం నిర్మాత ఆదినారాయణరావుగారికి వున్నది

ఇంతవరకు నాగేశ్వరరావుగారి చిత్రాలు నవయుగ, లక్ష్మి, అన్నపూర్ణ పంపిణీ సంస్థలు విడుదల చేస్తూ వచ్చాయి.

అంజలీ పిక్చర్ కంబైన్స్‌వారి "మహాకవి క్షేత్రయ్య" చిత్రం తారకరామ ద్వారా విడుదల గావడం గమనార్హం.

"క్షేత్రయ్య" అంటే కేవలం పిలక బ్రాహ్మడు అనెడి అభిప్రాయం చాలామందికి లేకపోలేదు. అది సదభిప్రాయం కాదని చిత్రం నిరూపిస్తుంది. ఈ చిత్రానికి ఆదుర్తి దర్శకుడు.

### అక్కినేని చిత్రానికి బాపు దర్శకత్వం

"బుద్ధిమంతుడు", "అందాలరాముడు" చిత్రాలను అందించిన "బాపు — రమణ టీమ్" నటసామ్రాట్‌తో ఒక వినూత్నమైన సాంఘిక చిత్రాన్ని తలపెట్టిన నిజాన్ని, అక్కినేని ద్వారా తెలుసుకొన్నాను.

"శ్రీ త్యాగరాజ రామాయణం" చిత్ర నిర్మాణాన్ని తాత్కాలికంగా వాయిదా వెయ్యమని అక్కినేని యిచ్చిన సలహాను, "రమణ — బాపు" పాటించక మానరు.

### అక్కినేనికి అభ్యంతరమా ?

ఆంధ్రుల అభిమాన నటి వాణిశ్రీతో కొందరు నటించకూడదు అని ఆంక్ష విధించుకున్నారనెడి వార్త ప్రేక్షకులకు తెలియనిదికాదు. అట్టి అభిప్రాయం అక్కినేనిగారికి లేదు అని తెలప వలసిన ధర్మం నాకున్నది. వాణిశ్రీతో కలిసి నటించడానికి తనకు ఎలాంటి అభ్యంతరం లేదని చెప్పి, ఆమె టాలెంటును అభినందించారు.

### సెక్రటరిలో అగ్రద్వయం

విఖ్యాత చిత్ర నిర్మాత రామానాయుడుగారిని అక్కినేనిగారి రూమ్‌లో కలిశాను. రాబోయే జనవరిలో "సెక్రటరి" చిత్ర నిర్మాణం ప్రారంభమవుతుందని, నాగేశ్వరరావు — వాణిశ్రీగార్లు ప్రధాన జంటగా నటించగలరని, సహాయ పాత్రలను ఎవరు పోషించినా ఒకటేనని సురేష్ అధినేత అన్నారు

ప్రేక్షకులు ఆరాధించి, ఆదరించేవాళ్ళను ఏ నిర్మాత వదులుకోగలడు ?

### కన్నప్ప ఆంధ్రా పర్యటన

హీరో కృష్ణంరాజు "భక్త కన్నప్ప" చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించగలరని పాఠకులకు అనేకసార్లు తెలిపాను

ఈమధ్య కన్నప్ప పాత్రధారి ఆంధ్రదేశాన్ని పర్యటించి వచ్చారు. మన గడ్డకు వున్న రమణీయతను, ప్రకృతి సౌందర్యాన్ని తన చిత్రానికి వినియోగించడానికి గాను, కొన్ని స్థలాలను ఎంపిక చేశారు. ఆవేమిటన.

శ్రీకాళహస్తి గాక, అరకులోయ, తాడేరు, పిఠేశ్వరం, ధరకొండ, సీలేరు, గుట్టాయగూడెం, జంగారెడ్డిగూడెం మున్నగు ప్రదేశాలను పర్యటించి వచ్చారు, కృష్ణంరాజు.

"భక్త కన్నప్ప" చిత్రాన్ని "నభూతో నభవిష్యతి"గా రూపొందించడానికి, కృష్ణంరాజు ఎన్నో గ్రంథాలను పఠించి, అమూల్యమైన విషయాన్ని సేకరించిన నిజాన్ని, ఆయన యింటినిండా వున్న రచనలు వెల్లడించాయి ఈ చిత్రానికి విక్టరీ దర్శకుడు గావడం మరొక యస్సెట్.

"పిచ్చెమ్మ—చిలకమ్మ"లో కె. విజయ, మురళీమోహన్





"దేవుడులాంటి మనిషి"లో మంజుల, కృష్ణ

## అపశృతులు

శ్రీ గౌతమ్ పిక్చర్స్ "అపశృతులు" కథ ఆధారంగా నిర్మిస్తున్న చిత్రం తాలుకు రషస్‌ను చూడడం జరిగింది.

"వనజ–గిరిజ"లో ఒక దృశ్యం



నే చూచినది అయిదు రీళ్ల చిత్రం. అతిశయోక్తి కాదు గాని, చిత్రం బలేగా వచ్చింది.

చిత్రంలో జమున నటన చాలా నాచురల్‌గా వుంది. కొత్త నటి హేమాచవుదరి నటనలో ఈజ్ కనిపించింది. మిక్కిలినేని నటనలో కొత్తదనం అగుపించింది. చిత్రం పోయే పోకడ ఆసక్తిని, అనురక్తిని కలిగించింది. నేను చూచిన రష్‌లో సత్యనారాయణ విభాగం చాలా తక్కువే.

ప్రతి సన్నివేశం నిండుగా, మనసులో నిలచేదిగా యోగానంద్‌గారి పనితనం కనిపించింది. డి. వి. నరసరాజుగారి సంభాషణల్లో పొరస్యం వుండబట్టే, రష్ చూచిన ఫీలింగును యివ్వలేకపోయింది.

గౌతమీ రామబ్రహ్మంగారికి యీ కొత్త చిత్రం ఆశాకిరణం కాగలదు అనేది నిజాన్ని రష్ వెల్లడి చేసింది.

## వృత్తి - చిత్తవృత్తి

ప్రతి మనిషికి వృత్తి ఒకటిగా, చిత్తవృత్తి వేరొకటిగా వుంటుంది అనేది అంశంపై, [illegible] రచయిత రాజశ్రీ "దేవుడిచ్చిన చెల్లెలు" కథను సృష్టించారు.

పరిస్థితులే మనిషి యొక్క జీవిత [illegible] మారుస్తాయి. ఆ జీవితానికి కష్టాన్ని కలిగించే పరిస్థితులు సంభవించినప్పుడు, అతడి మనసు, మార్గం మారుతుంది అనేది నిజాన్ని చాటిచెప్పే చిత్ర కథ "దేవుడిచ్చిన చెల్లెలు."

ఈ చిత్రంలో వృత్తికి, చిత్తవృత్తికి నడుమ నలిగే దొంగగా రామకృష్ణ కొత్తతరహా పాత్రను పోషిస్తున్నారు. సహాయ పాత్రలను మమత, సుమిత్ర, మురళీమోహన్, గిరిబాబు, ధూళిపాళ, అల్లురామలింగయ్య, పొట్టిప్రసాద్ గార్లకు యివ్వబడింది.

"దేవుడిచ్చిన చెల్లెలు"లో మమత

కొత్తవలస గోవిందరాజులు నిర్మిస్తున్న "దేవుడిచ్చిన చెల్లెలు" చిత్రానికి కథ, మాట పాటలు, సినిమా అనువాదం మరియు దర్శకత్వంను రాజశ్రీ నిర్వహిస్తున్నారు. గుండు సత్యనారాయణ నిర్మాణ సారధి. పూర్ణా పంపిణీదారులు.

— శ్రీనివాస్

"పిచ్చి మారాజు"లో శోభన్‌బాబు, మంజుల



అన్నారనీను. అయితే ఆ తర్వాత ఓ వారానికి మునసబు, కరణాల సర్టిఫికేట్లు పంపిస్తూ "ప్రభాకరానికి యిష్టంలేదనుకో. అయినా నీ నిర్ణయం నాకు నచ్చింది. అందుకే అతను వద్దంటున్నా, ఈ సర్టిఫికేట్లు తీసుకుని నీకు పంపిస్తున్నాను. ప్రభాకరం, జోగమ్మగారూ మనం అంటే ఎంత అభిమానంగా వున్నా, మరీ అంతగా వాళ్ళమీద భారం వెయ్యడం మంచిదికాదు" అంటూ ఇంకో వుత్తరం రాశాడు మురళి. తర్వాత ఎలాగో సర్ది చెప్పి జోగమ్మగారికీ, ప్రభాకరానికీ కోపం తగ్గించవచ్చులే అనుకొంది ఉష.

అప్పుడప్పుడు దుర్గాబాయిమ్మగారు వచ్చి మహిళా సభలో వున్న అమ్మాయిల కందరికీ, చక్కని హితబోధలు చేసి మంచి మంచి సంగతులు చెబుతూ వుండేవారు. ఎవరేనా ముఖ్య అతిధులూ, విద్యాశాఖాధికారులూ, సంఘ సేవా కార్యకర్తలూ, మంత్రులూ వచ్చినప్పుడు, ప్రత్యేక కార్యక్రమాలు జరిగేవి. వాటిలో విధిగా ప్రార్థనాగీతం ఉష పాడవలసి వచ్చేది. ఇంతమంది వుండగా తనకే ఆ అవకాశం వస్తూన్నందుకు ఉషకి ఓ రకమైన ఆనందం, ఆత్మవిశ్వాసం కలిగేది.

వంట నేర్చుకోవలసిన వాళ్ళచేత, ఆదివారం చిన్న చిన్న వంటలు చేయించేవారు. తనకి వంట బాగా చేతనైనా, సరదాకోసం, నేర్చుకొనేవాళ్ళతో కలిసి, ఒక్కొక్కరోజున వంట చేసేది ఉష. ఆ రోజున ఆమె వంట రుచి చూసినవాళ్ళు లొట్టలు వేస్తూ తిని "ఎవడు వస్తాడోకానీ ఆ వచ్చినవాడు నీ వంట రుచిచూసి యింక నిన్ను తెగపొగిడి దాసానుదాసుడైపోతాడు. ఇంక నీ రూపం, సరే సరి ... గడప దాటకుండా కట్టిపడేస్తుంది, ఆ మొగ మహారాజుని" అంటూ నవ్వుతూ పొగిడి ఉషని ఉక్కిరి బిక్కిరి చేసేవారు.

థర్డ్‌ఫారం పరీక్షలయాయి. మురళి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చి నెల్లాళ్ళయింది. శలవలకి యింటికి వెళదాం అంటే, ఊళ్ళో వున్నాడో లేడో. ప్రభాకరం వాళ్ళ యింటికి వెళ్ళి తను పదిరోజులు వుండొచ్చు. కాని ఆమధ్యన ఓ వుత్తరంలో ప్రభాకరం "శలవలు యివ్వగానే వారం రోజులకీ పదిరోజులకీ పరిగెట్టుకుని వచ్చెయ్యకు. అక్కడే వుండి తర్వాత క్లాసు పాఠాలు చదువుకో. లేకపోతే ఏ చక్కని లలితకళో నేర్చుకో. వేసంకాలం శలవల్లో వద్దువుగానిలే!" అంటూ రాశాడు. దాంతో పౌరుషం వచ్చింది ఉషకి. అందుకే పదిరోజులు శలవలు వచ్చినా మద్రాసులోనే వుండిపోయింది ఉష. కాని ఏమిటో మనస్సంతా తిక్కగా ఏం తోచకుండా చికాగ్గా వుంది.

అందుకే ఓ రోజున "అలా మెరీనా బీచ్‌కేసి వెళ్ళివస్తాను పర్మిషన్ ఇమ్మ"ని ఉష వార్డెన్‌ని అడిగింది. అది విని ఆమెతో 'మేం కూడా వస్తాం' అంటూ పది పదిహేనుగురు స్నేహితురాండ్రు బయలుదేరారు. "ఇంతమంది వెళుతున్నారు కనుక వేన్ ఇస్తాను. అయితే వేన్ అక్కడ అంతసేపూ ఉండడానికి వీలుండదు. మళ్ళీ ఆరు, ఆరున్నరకి పంపిస్తాను వేన్‌ని. చీకటి పడకుండా వచ్చెయ్యండి... పగటిపూటే కనక ఫర్వాలేదు వెళ్ళిరండి. నేను



# గాజు మేడ

(22 వ పేజీ తరువాయి)

రాలేదు కదా అని మీ ఇష్టం వచ్చినట్లు అటూ ఇటూ వెళ్ళారు కనక! తిన్నగా వెళ్ళి తిన్నగా వచ్చెయ్యాలి" అంటూ హెచ్చరించింది వార్డెన్.

మెరీనా బీచ్ ఎంతో సందడిగా ఉంది. వందల కొద్దీ జనం ఒకళ్ళతో ఒకళ్ళకి సంబంధం లేకుండా, ఒంటరిగానూ, జంట జంటలుగానూ గుంపు గుంపులుగానూ కూర్చున్నారు. కల కల నవ్వుతూన్న యువతులు — గట్టిగా మాట్లాడుతూ వచ్చే పోయే మనుష్యుల మీద జోక్స్ వేస్తూ ఆనందిస్తూన్న యువకులు — పాత గాధలు తవ్వి పోసుకుంటూన్న ముసలివాళ్ళు—బోసి నవ్వులతో చిన్న చిన్న అడుగులు వేసుకుంటూ ఆడుకొంటూన్న పసివాళ్ళు. బుడగలు ఎగరేస్తూ, వేరుశనక్కాయలు కొనుక్కుతింటూ, ఎన్‌ఫ్రూట్ చప్పరిస్తూ, ఓరగా చూస్తూ, గాలికి ఎగురుతూన్న రంగు రంగుల పైటల్ని ఆబగా పరికిస్తూ, ఇలా ఎవరి హడావిడిలో వాళ్ళుంటే, ఇంత చైతన్యవంతమైన జీవితంలోకి తనూ వచ్చి పడాలనే ఆత్రుతతో సముద్రం ఏక కెరటాలు




కొడుతూ, పెద్ద పెద్ద కెరటాలతో విరుచుకుపడుతోంది. చల్లని గాలి, హాయిగా వచ్చి ఒళ్ళు నిమిరిపోతూంటే, మైమరచిపోతూ, ఉష స్నేహితులు కొందరు సంతోషంతో గొంతెత్తి పాడసాగారు.

ఉష మాత్రం ఏ ఆలోచనా లేకుండా, చెంపని చెయ్యి చేర్చుకుని, చెలియలి కట్టని దాటలేక విరిగిపోతూన్న కెరటంకేసి నిశ్చలంగా చూస్తూ కూర్చుంది.

పక్కనున్న ఓ స్నేహితురాలు, తక్కినవాళ్ళకి ఉషని చూపించి "మన ఉష ఎలా కూర్చుందో చూడండర్రా. దీన్ని చూస్తే మీకు ఎలా అనిపిస్తోంది?" అని అడిగింది కొంటెగా.

"బంగారపు బొమ్మలా ఉంది."

"ముద్దుల గుమ్మలా లేదూ?"

"ప్రియుని కోసం వేచియున్న అభిసారికలా..."

"బృందావనంలో పులకిస్తూన్న రాధికలా..."

"ఓ బొమ్మా, ముద్దుల గుమ్మా, రాధికా, అభిసారికా" అంటూ నలుగురూ కలిసి ఉష బుజాలు పట్టుకుని కుదిపి "ఏమిటమ్మా ఈ దీర్ఘాలోచన" అని నవ్వుతూ అడిగారు.

"ఏం లేదర్రా! ఎక్కువ బాధగా ఉన్నా ఎక్కువ ఆనందంగా ఉన్నా మనస్సు ఇలా అచేతనంగా ఉంటుంది" అంది ఉష.

"అబ్బో... కవిత్వం వస్తోందే! ... యింతకీ అమ్మాయిగారి కిప్పుడు బాధా, ఆనందమా?"

"అది కాదే! నాకు ఊహ వచ్చాక కవ్విస్తూ మనస్సు ఇంత ఆనందంగా ఎప్పుడూ లేదు" అంది ఉష.

"అయితే, తమరిప్పుడు పులకిస్తూ ఊహల్లో తేలిపోతూ, ఎలాగో మారిపోవాలనీ, ఎందుకో కరిగిపోవాలనీ, ఎవరికో తమర్ని తాము అర్పించుకోవాలనీ, తహతహలాడుతున్నారన్నమాట!" అంది ఒక స్నేహితురాలు నవ్వుతూ.

సిగ్గుతో ఉష బుగ్గలు ఎర్రబడ్డాయి. కళ్ళు పెద్దవిచేసి కోపంగా చూడాలనుకుంది. కాని నవ్వు వచ్చేసింది. అంతా ఘొల్లున నవ్వారు. వెంటనే హఠాత్తుగా అంతా నవ్వులు ఆపేశారు. వాళ్ళకి కొంచెం దూరంగా పరిచయమైన కంఠం వినిపించింది. అంతా చటుక్కున అటుతిరిగి చూశారు.

"అదిగో అటు చూడు ... ఆ అబ్బాయి ఒళ్ళో తలపెట్టుకుని పడుకున్నది మన యశోద కాదూ?"

"అవునవును. నవ్వుతూ అతనితో యేదో మాట్లాడుతోంది."

"పొద్దున్న అతనే వచ్చి మా కజిన్‌ని ఇంటికి తీసుకువెళ్ళి మళ్ళీ సాయంత్రం పంపిస్తానంటూ, దాని ఇంటి పేరుతోనే సంతకంచేసి తీసికెళ్ళాడు హాస్టల్ నుంచి."

"కన్వీనియెంట్ కజిన్!"

ఉష కోపంతో ఊగిపోయింది.

"దీని సంగతి మన వార్డెన్‌గారితో చెప్పాలి" అంది ఉష.

"మన కెందుకు పోనిద్దూ?... వయస్సుదాన్ని అలా తొందర పెట్టింది. దాన్ని అల్లరి పెట్టడం ఎందుకు మనం?"

"దాని బతుకు అల్లరవుతుందని ఊరుకుంటే, మచ్చలేని స్వచ్ఛమైన మన మహిళా సంఘమే అల్లరిపాలవుతుంది. ఎవరో ఒకళ్ళో ఇద్దరో ఇల్లాంటి వాళ్ళు ఉండడంవల్లే తక్కిన వాళ్ళందరికీ చెడ్డపేరు వస్తుంది."

"పదిమంది కూడిన సంఘంలో అన్ని రకాల వాళ్ళూ ఉంటారు మరి. అర్థం లేకుండా ఉన్నారని కొందరిని అండమాన్సు పంపించేస్తాం అంటే ఎలా?"

"ఇదిగో ఇందుకే కొందరు మనల్ని లోకువ కడుతున్నారు."

"కొందరంటే ఎవళ్ళు? మగాళ్ళా?... అది సరే... యశోదలాంటి దెవరో దూరదృష్టి లేక ఇలా తెలివితక్కువగా ప్రవర్తించిందనుకో... మరి అన్నీ తెలిసిన మగాడై ఉండీ అతనెందుకే దీని చూపులికి ఎర కావడం?"

"అది అతని తెలివి తక్కువే! భవిష్యత్తుని మంటగలుపుకొని దీనికి బానిస అయ్యాడు... అయితే మగాళ్ళలో కొందరు దూరాలోచన ఉండే ఉత్తములున్నారు. వాళ్ళనే 'పురుషులలో పుణ్య పురుషులు వేరయా' అంటూ వేమన పొగిడాడు."

"గొప్ప పని చేశాడు కాని ఇంక లే వెళదాం."

"మన వేన్ ఇంకా రాలేదేమిటి?"

"వేన్‌కోసం కూచుంటే చీకటిపడుతుంది. వార్డెన్‌గారిచేత ఆనక చివాట్లుతినాలి."

"సరే అయితే సిటీబస్సులో పోదాం లేవండే"

# పెరిగేవయస్సు ఆరోగ్యవంతముగా అవుతుంది ఇన్‌క్రిమిన్*తో

కరకరమంటూ తింటూ ఉంది
పరుగులాడుతూ పెరుగుతోంది

Incremin* syrup

VITAMINS B1, B6, B12 LYSINE WITH IRON

TONIC APPETITE STIMULANT

బాల్యదశ రోజులు : ఫలపుష్పభరితంగా పెరిగే రోజులు! ఈ రోజుల్లో పిల్లల శరీరం పూవులాగా వికసిస్తుంది. వీరికి ఇన్‌క్రిమిన్ సిరప్ తప్పక ఇవ్వండి. ఇహ చూడండి ఆహారము తినకుండా మారాము చేసే పిల్లల ఆకలి ఎంత పెరుగుతుందో— వీరు తినే, తాగే ఆహారమంతా కూడా వంటికి బాగా పడుతుంది. లాభదాయకమైన మరియు ఐరన్‌తో పరిపూర్ణమైన విటమిన్లు ఇన్‌క్రిమిన్‌లో, ఆహారము యొక్క అన్ని పోషక తత్వములను గ్రహించేందుకు సహాయము చేసే విశేషమైన అమినో ఏసిడ్, లైసిన్ కూడా ఉన్నాయి.

## ఇన్‌క్రిమిన్* టానిక్

డ్రాప్స్— శిశువులకు 2 నెలల నుండీ 2 సంవత్సరాల వరకు

సిరప్— 14 సంవత్సరముల వయస్సు వంకు పిల్లలకు

**అధిక ఆహారాన్ని అధిక పెరుగుదలగా మారుస్తుంది తింటున్న ఆహారమంతా వంటికి పట్టేట్టు చేస్తుంది**

డాక్టర్లు విశ్వసించే పేరు— Lederle

సయానమిడ్ ఇండియా లిమిటెడ్ వారి ఒక విభాగం *అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

Sista's INC-363 1/75 Tel

బిలబిలమని ఎక్కి గలగలమని నవ్వుతూ బస్సు అంతా గందరగోళం చేస్తూన్న ఉష స్నేహితు రాండ్రని చూసి "హబ్బబ్బ! ఈ ఆడపిల్లలు మగపిల్లల్ని మించిపోతున్నారురా బాబూ" అనే అర్థంతో, "అడడా ... ఇంద పొంబళెళ్ళు అంబళు మేల పోరాంగడ..." అంటూ అరవంలో అన్నాడు కండక్టరు. ఆ మాటలు విని 'మనవాళ్లెవరూ మాట్లాడకండి' అంది ఉష గట్టిగా. వెంటనే అంతా ఊరుకున్నారు.

ఆమె కంఠం విని వెనక సీటులో, గ్లాస్కో పంచె, సిల్కు లాల్చీ, మెళ్ళో గొలుసూతో, మహారాజులా దర్జాగా కూర్చున్న ఆసామీ ఒకడు వెంటనే లేచి, జనాన్ని అందర్నీ తప్పించుకుంటూ, పైనున్న బెల్ట్ పట్టుకుని నుంచున్న ఉష దగ్గరకి వచ్చి 'నువ్వెప్పుడొచ్చావు మెడ్రాసు?' అంటూ పలకరించాడు.

ఆ పలకరింపు విని గుండె ఆగినట్టయి పక్కకి తిరిగి చూసింది.

అంకరాజు!

వెన్నులోంచి భయం జివ్వుమంటూ పరి గెట్టింది. ఇదే అయిదారు నెలల క్రితం, హృదయం యింకా బేలగా వున్న రోజుల్లో అయితే, మృత్యువును చూసినట్లు పిచ్చికేకపెట్టి స్పృహతప్పి పడిపోయి వుండేది. అతణ్ణి చూస్తూనే, అతను నిద్దర మాత్రలు యివ్వడం, తండ్రి చనిపోవడం, తనని బలాత్కరించబోవడం అన్నీ ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చి, కోపం, పగ, బాధా జ్వాలల్లా గుండెల్లోంచి లేస్తూంటే ఆడసింహంలా చూసింది అంకరాజుకేసి. ముఖం అంతా జేవురించి కళ్ళు ఎర్రగా మారిపోయి కణతలు అదురుతూన్న ఉషని చూసేసరికి భయం వేసింది అంకరాజుకి.

తనలో తను గొణుక్కున్నట్లు "అలా అవుతుందని నేను అనుకోలేదు. తర్వాత తెలిసింది పాపం ఆయన పోయారని. నువ్వు నన్ను సరిగా అర్థం చేసుకోలేదుకాని ఆ రోజున..." అంకరాజు యింకా యేదో చెప్పబోతున్నాడు.

ఏదో స్టాప్ వచ్చి బస్ ఆగింది. "మన వాళ్ళంతా దిగండర్రా" అని ఒక్క కేకవేసి ఉష

"అమ్మా – నాన్న"లో కృష్ణంరాజు, ప్రభ

బస్ దిగేసింది. ఆమె స్నేహితురాండ్రంతా ఏమిటో అర్థంకాక గబగబా దిగేశారు. బస్ వెళ్ళిపోయింది. 'హమ్మయ్య' అని గుండెలమీద చెయ్యి వేసుకుని పెద్ద బరువూ బెంగా తీరినట్లు నిట్టూర్చింది ఉష.

"ఏం జరిగిందే! ఏవిటిలా మధ్యలో దింపేశావు!"

"ఇంకో బస్సులో వెళదాంలెండి."

"అతనెవరు నిన్ను పలకరించాడు?"

"వాడా?...వా...డు...వాడొక కుక్కలే! ..." అంది ఉష. ఆమె ముఖం కొలిమిలా, ఎర్రగా భగభగలాడుతూ కనిపించేసరికి, హడలిపోయి, ఆ తర్వాత వాళ్ళెవరూ ఆమెని మరి ఏమీ ప్రశ్నించలేదు. "వీడు యిక్కడ వున్నాడా? ... నా వునికి వీడికి తెలియకూడదు. వీలైనంతవరకూ వూళ్ళోకి రాకుండావుండడం మంచిది. త్వరలో ఊరునుంచి వెళ్ళిపోవడం యింకా మంచిది" అనుకొంది ఉష.

8

గుంటూరుకి దగ్గర్లో ఉన్న అమరావతికి వెళ్ళి వచ్చాక లీలకి సగం ఉత్సాహం తగ్గిపోయింది. ఏ స్థూపం చూద్దాం అన్నా, ఏ శిల్పం చూద్దాం అన్నా అసంపూర్ణమే! ప్రతీదీ మద్రాసు మ్యూజియమ్‌కి తరలించుకు పోయారనీ, అపురూపమైనవి కొన్ని లండన్‌కి తీసుకుపోయారనీ, అక్కడవాళ్ళు చెబుతూంటే ఆమెకి విని విని విసుగేసింది. "అన్నీ పోయాక ఇంక ఇక్కడ చూసేదేవిటి? నడవండి నాగార్జున కొండకి వెళదాం" అంది.

మురళి నవ్వుతూ "ఎక్కడికి వెళ్ళినా మనకి సంపూర్ణమైన పూర్వపు వైభవం, సౌందర్యం కనిపించవు. అక్కడా చేతులూ కాళ్ళూ విరిగిపోయిన శిల్పాలూ, చెదురు మదురుగా కనిపించే శిధిలాలే! ఈ జీర్ణ సౌందర్యాలని చూసి, దీనినిబట్టి ఆ రోజుల్ని ఊహిస్తే, గత వైభవాలు ఊహాదృష్టికి గోచరిస్తాయి" అన్నాడు.

అతని మాటల్ని వింతగా చెక్కిలిని చెయ్యి చేర్చుకుని వింది లీల. అయితే నాగార్జున శిల్పాలు చూశాక ఆమెకి మళ్ళీ కొత్త ఉత్సాహం వచ్చింది. ప్రతి శిల్పంలోనూ చక్కని జిలుగు పనితనం, ప్రతి బొమ్మలోనూ తొణికిసలాడుతూన్న జీవం, ప్రతి రాతి పలకలోనూ తొంగిచూస్తూన్న శిల్పి కళామయ సృష్టి – తన్మయత్వంతో చూస్తూన్న లీల దృష్టిని ఆకర్షించినవి ముఖ్యంగా మూడు శిల్పాలు – తథాగతుని మహాభినిష్క్రమణ – ప్రియుడు అందిస్తున్న క్షీర పాత్రని సోయగాలుపోతూ సిగ్గులు గుమ్మరిస్తూ అందుకుంటూన్న లేజవ్వని – చేతులూ మనస్సులూ కలుపుకొని మురిసిపోతూన్న అందాల జంట.

ఆ అపురూప కళాఖండాల్ని చూస్తున్నప్పుడు లీలకి ఎందుకో ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చింది. అప్రయత్నంగా తల తిప్పి చూసింది. మురళి, తననీ శిల్పాన్నీ మార్చి మార్చి చూస్తున్నాడు. ఏవిటా కొంటె చూపు... ఇంకా ఏదో అమాయకుడను కున్నాను... అమ్మో గడుసువాడే... అనుకుంటూ లీల మునిపంటితో కింది పెదవి నొక్కుకుంటూ ముందుకి నడిచింది.

కొండ చివరకి వెళ్ళి నుంచుంటే, హోరుమంటూ గాలి మనిషిని ఎత్తేస్తోంది. కుడి వైపున దూరంగా, నాగార్జునసాగర్ ఆనకట్ట దగ్గర పని చేస్తూన్న యంత్రాలూ, కూలీలూ, చిన్న చిన్న ఆట వస్తువులులాగా, కదులుతూన్న చీమలలాగా కనిపిస్తూంటే, ఎదురుగుండా కొండ కిందని నయ్యారాలుపోతూ అపురూప నాట్యాలు చేస్తూన్న అప్సర కన్నెలా, గల గలా కదిలిపోతోంది కృష్ణానది. కొండల మధ్యనుంచి చప్పుడు చేసుకుంటూ సన్నని ఏరులా ప్రవహిస్తూన్న కృష్ణవేణి, "ఆనకట్ట కట్టి నన్ను ఆపగలరా మీరు!" అని, మనిషి చేస్తూన్న ప్రయత్నాన్ని చూసి, పక పకా నవ్వుతున్నట్లుంది. లీల మనస్సు ఎప్పుడూ లేనంతగా ఉత్సాహంతో ఉరకలు వేస్తూ పరవళ్ళు తొక్కుతోంది.

[ఇంకా ఉంది]

మిస్ అమెరికాగా ఎన్నికైన 23 సంవత్సరాల పట్టభద్రురాలు సమ్మర్ బార్తొలోమ్యూ. కాలిఫోర్నియాలోని మెర్సిడ్‌కి చెందిన ఈ సుందరి జూలైలో జరిగిన విశ్వసుందరి పోటీలలో అమెరికా తరఫున పాల్గొన్నది తృతీయస్థానం అందుకున్నది

ఈమధ్య తెలుగుసినిమాలు మరీ దిగజారి పోతున్నాయండీ!

సినిమాలు కావ్ ఓ దిగజారేవి. సినితారల బట్టలు!!

"ఓ సేవ్! ఎక్కడ తగలబడ్డావూ......! ఇటా!"

"ఆ...వస్తున్నా!"

"అక్కడ ఏం తగలబెడుతున్నావే! త్వరగా రా!"

"ఏమిటా రంకెలు! ఏదో కొంపలు తగలబడుతున్నట్లు!" భర్త అరుపులు విని అట్లకాడలా చేత్తో పట్టుకొని బయటకు వచ్చింది పార్వతమ్మ.

"ఈ చిన్నోడు ఎక్కడ తగలబడ్డాడు అంట" అడిగారు రామయ్యగారు.

"ఏమో! నాకేం తెలుసు ఎక్కడ తగలబడ్డాడో! అక్కడ అట్లుమాడి తగలబడుతున్నాయి."

"నాకు ఓ నాలుగట్లు తొందరగా తగలబెట్టు నేను పోవాలి"

"బయట ఏం రాచకార్యాలు తగలబడుతున్నాయి అంత తొందర?" లోపలనుండి అరిచింది.

"నాన్నా! మా క్లాసు పిల్లలు సినిమాకు పోతున్నారు నేనూ వెళ్ళద్దా!" అడిగింది కూతురు రాణి.

"ఏం సినిమాకు తగలబడుతున్నార్రా?"

"నిజం చెపితే నమ్మరు"

"నమ్మి తగలబడుతాలే చెప్పు ఎందుకు నమ్మమూ?" విసుగ్గా అన్నారు.

"నిజం చెపితే నమ్మరు నాన్నా!"

"నమ్ముతానంటున్నాగా!"

"అబ్బా! అది సినిమా పేరు నాన్నా!" విసుగ్గా అన్నది.

"నా దగ్గర డబ్బులు తగలబడలేదు"

"అమ్మ ఇచ్చిందిలే నాన్నా" అన్నది నవ్వుతూ.

"అమ్మ తగలబెట్టిందీ! నాకు తెలుసు. తగలబెట్టే గుణాలు అన్నీ అదే నేర్పుతుందని! ఇంకేం! ఇహ తగలబడు!"

"వస్తాను నాన్నా!" అంటూ బయటకు వెళ్ళిపోయింది.

గదిలోనుండి సినిమా పాటల రాగంలో ఒక పాట వినిపిస్తున్నది.

"గదిలో ఈగలు మూగే...! తోలలేక నే నోడే...!" (మదిలో వీణలు మోగే ఆశ లెన్నో చెలరేగే)

"ఏరా పెద్దోడా! ఇంకా ఇంట్లోనే తగలబడ్డావా!"

"ఆ...ఆ...బయటకు తగలబడబోతున్నా" అంటూ పన్నెండేళ్ల చిట్టిబాబు బయటకు వచ్చి తల్లిదగ్గరకు చేరాడు.

టిఫిన్ సరిపోలేదు అనుకుంటాను. ఆ పిల్లాడికి తిండి పిచ్చి + పాటల పిచ్చీ రెండూ సమానంగా ఉన్నాయి.

"ఆకలి తీరలేదే ...! నా కడుపు నిండలేదే ...!" (తనివి తీరలేదే)

"ఏమిటమ్మా! పచ్చడి ఇంకా పూర్తి




కాలేదా? అరే! టయిం అయిపోతున్నది."

"ఈరోజుకు పచ్చడిలేదూ...ఎనిగింటలలో పూర్తి కాదూ ... నా నోటికి రుచిఏలేదూ... ఈ టిఫెనెందులకో బాగా లేదూ ..." (ఈ వీణకు శృతి లేదు)

"నాయనా కవీ! రవి పిలుస్తున్నాడు"

చిట్టిబాబు బయటకువచ్చి వచ్చిన పిల్లవాడితో వెళ్ళబోతుంటే,

"ఎక్కడికి తగలబడుతున్నావురా." అని అడిగారు.

"సినిమాకి"

"ఏం సినిమాకి?"

"నేనూ మనిషినే!"

"నేను కాదన్నానా?"

"అది సినిమా పేరులే నాన్నా" అంటూ వెళ్ళబోయాడు.

"ఒరేయ్! డబ్బులు ఎక్కడివిరా!"

"నీ జేబులో నే చూశానులే... అది తీశానులే..." (నీ కన్నులలో నే చూశానులే అది నా రూపమే)

"ఒరే! జేబులో ఒక్క రూపాయిమాత్రమే తగలబడింది! అది కాస్తా నువ్వు తీసుకున్నావురా!" అన్నారు.

కానీ చిట్టిబాబు వినిపించుకోలేదు వెళ్ళిపోయాడు.

ఇంతలోకే పార్వతమ్మ అట్లు తీసుకొని వచ్చింది.

"ఇంతసేపటికాతగలబడేది! ఇంకా నేను ఎప్పటికితగలబడాలి? పర్సులో ఒక్క పైసాకూడా తగలబడలేదు! ఇంకా ఫస్టు తారీఖు ఎప్పటికి తగలబడుతుందో! అట్లు కూడా తగలబడ్డట్లే వున్నాయి!"

"ఏమండీ! పక్కింటి కామాక్షమ్మగారు సినిమాకి పోతున్నారు నేను కూడా వెళ్ళనా?"

"ఏం సినిమా?" అట్లు సేవిస్తూ అన్నారు.

"మా నాన్న నిర్దోషి!"

"ఇదిగో నువ్వు ఏమిటీ అన్నది" ముఖం చిట్లించి అన్నారు

"మా నాన్న నిర్దోషి అన్నాను! వినిపించిందా?"

"ఇదిగో మీనాన్న నిర్దోషి అంటే నేను ఒప్పుకోను! ఆరోజు పెళ్ళిరోజు వాచీ ఇస్తానని మాటఇచ్చి ఇంతవరకు కొనివ్వలేదు! అసలు మీనాన్న వాచీ కొని ఇచ్చేదాకా నన్ను తగలబెట్టినా సరే నిన్ను సినిమాకి పంపించను!"

—సీరియల్—

# రాగవీచికలు

## —ఆదూరి—
## —వేంకటసీతారామమూర్తి—

(గత సంచిక తరువాయి)

> **జరిగిన కథ : 2** వర్దని తండ్రి రంగారావు బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తుంటాడు. చదువుకుని ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకోవాలనే వుద్దేశ్యంతో తల్లి మాణిక్యమ్మని, స్నేహితుల్ని అందర్ని వదిలి విశాఖపట్నం వచ్చిన వర్దనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సాహం లభిస్తుంది. వర్దని అన్న ప్రసాద్ చిరుద్యోగి.

ఎండ చుర్రు మంటోంది—

అల్లంత దూరాన్నే అన్నయ్యను చూసిన వర్దని కళ్లు ఆనందంతో నిండి పోయాయి. మేడమెట్లు దిగి క్రిందికివచ్చి హాల్లోకి పరుగెత్తి వీధి తలుపు తీసింది.

"ఆడపిల్లవు- ఎందుకే ఆ పరుగు ?" అంటూ హాల్లో నడుంవాల్చిన మహాలక్ష్మమ్మగారు లేచి కూర్చుంది.

"యేంలేదు. అన్నయ్య వస్తున్నాడు"

"అంతేనా? ఆపాటి దానికా పరుగెందుకూ? వచ్చేవాడు యింట్లోకి రాకుండా వుంటాడా"

వర్దని చిన్నబుచ్చుకుంది. అమ్మమ్మ అలా అనటం ఆ అమ్మాయికేం నచ్చలేదు-అసలు అన్నయ్యంటే తాతయ్యకీ అమ్మమ్మకీ ఎందుకంత చులకనో అర్థంకాదు.

"యేంటమ్మా నే నొస్తున్నట్టు నీకెలా తెల్సూ వీధిలో కాసావు" అంటూ వచ్చాడు ప్రసాద్.

"నువ్వొస్తావని మామయ్య చెప్పారు" అంటూ లోనికి తీసుకువెళ్లి కూర్చోమని కుర్చీ చూపింది. ఈ సంవత్సర కాలంలోనూ అన్నయ్య కొద్దిగా మారాడనుకుంది. తెల్ల చొక్కా తెల్లలాగూ మనిషికి హుందాతనాన్నిచ్చాయి.

"యేవిటే వాడినలా చూస్తున్నావ్ - పోయి కాసిన్ని మంచినీళ్లు పట్టుకురా"అంది మహాలక్ష్మమ్మగారు గోడకు చేరబడి కూర్చుంటూ.

పరుగున లోనికి పోతున్న వర్దని ఎదురుగా విమల మంచినీళ్ల గ్లాసుతో రావటంతో చటుక్కున ఆగి ఆమె చేతిలోని గ్లాసు నందుకుని ప్రసాద్ కిచ్చింది.

"యేమయ్యా యీ మధ్య రావటమే మానేశావు" విమల ప్రశ్నకేదో జవాబు చెప్పాడు ప్రసాదు.

"వుద్యోగం ఖాయమైందేమిట్రా"అంటూ మహాలక్ష్మమ్మగారు మొదలు పెట్టారు— సాధారణంగా ఆవిడ మాట్లాడ్డం మొదలు పెడితే ఒకంతట ఆపరు— ఆవిడ కేదో సమాధానం చెప్పేలోగా'అత్తయ్యగారూ యీపూట వంటేమిటో చెప్పారు కారు'అంటూ లోపల్నించి విమల మాటలు వినిపించేసర్కి లోనికి నడిచారావిడ—

"అమ్మా తమ్ముళ్లూ ఎలా వున్నారు" అడిగాడు ప్రసాద్ వర్దనిని మహాలక్ష్మమ్మగార్ని లోనికి వెళ్ళనిచ్చి.

"ఎలా వుంటారూ— మామూలే- యీ ముసలాళ్లిద్దరి దగ్గరా పనిచేస్తూ వాళ్ళ దెప్పులకు భరించి వుంటోంది అమ్మ. పిల్లల సంగతి సరేసరి. చెబితే చదవటం, లేకుంటే ఆడుకోవటం. తాతయ్య దగ్గర భయం తప్పితే అభిమానం, గౌరవం ఎక్కడా లేవు వాళ్ళకి— ఇంకా ఆ వూళ్ళో వుంటే వాళ్ళ బవిష్యత్తు పాడై పోతుందేమోనని భయంగా వుంది."

"నేనూ అదే ఆలోచిస్తున్నానమ్మా కానీ యేమిటో యిక్కడి పరిస్థితులు కూడ అంత మెరుగ్గా కనిపించడంలేదు-ఇంతకీ నీ సంగతి మామయ్యేమన్నా అన్నారా ?"

"చెప్పారన్నయ్యా. నా వుద్దేశం కూడ అదేనని చెప్పాను- వూరికినే అక్కడ గడిపేదానికి బదులు ప్రయివేటుగా చదువుకున్నా కొంత నయంగదా"

"కానీ తాతయ్య వప్పుకుంటాడంటావా?" తనకొచ్చిన సందేహమే ప్రసాదుకీ రావటం ఆశ్చర్యమనిపించింది వర్దనికి.

"నా భయమూ అదే. కానీ మామయ్యే అన్ని విషయాలూ చూసుకుంటానని హామీ యిచ్చారు. ఆయన మాటలే నన్ను వుత్సాహ పరుస్తున్నాయి"

"ఇదిగో నయ్యా కాఫీ తీసుకో" అంటూ వచ్చింది విమల.

"ఇప్పుడెందుకత్తయ్యా"

"కాఫీయే గదా. అన్నట్టు యీ రోజు సెలవు పెట్టావా ?"

"అవునత్తయ్యా"

"అయితే యికనేం— యీ పూటకిక్కడే వుండిపో- అన్నా చెల్లెళ్లు కల్సుకుని ఎన్నాళ్లయిందో ఏమిటో"

విమల మాటలకు సంతోషించింది వర్దని. యేం మాట్లాడలేక వూరుకున్నాడు ప్రసాద్.

మరో అరగంటకల్లా తిరిగొచ్చిన మాధవరావుగారు. "యేరా బాగున్నావా" అన్నారు ప్రసాద్ని చూసి.

"బాగానే వున్నాను తాతయ్యా" అన్నాడు మరేం అనలేక.

"సంపాదనలో యేదన్నా వెనకేస్తున్నావా లేకపోతే మీ నాన్నలాగే..." తాతయ్య మాటలోని దెప్పను గ్రహించినా వూరుకున్నాడు ప్రసాద్ – వర్దనికి మాత్రం కోపం ముంచుకొచ్చింది.

ఉద్యోగమొచ్చి యింకా యేడాది కాలేదు— ఇటు వండుకుతింటూ అటు వుద్యోగం చేసుకుంటూ చాలీచాలని సంపాదనను సరిపెట్టుకునే స్థితిలో వాడుంటే యీయన దెప్పులొకటీ — విసుక్కుంది మనసులోనే—

ఆ రెండు ముక్కలే ముఖాన అడిగి స్నానానికి వెళ్ళిపోయారాయన.

భోజనాలయ్యేసర్కి పన్నెండు దాటింది.

ముందుహాల్లో అప్పటికే సగం నిద్రలో వున్న భర్తకు తోడుగా అక్కడే మరో మూల మేను వాల్చింది మహాలక్ష్మమ్మగారు. కాస్సేపు అన్నా చెల్లెళ్ళతో మాట్లాడి మేడెక్కి పోయింది విమల. ప్రసాద్తో యేదో

మాట్లాడుతున్నదల్లా ఆపి "అన్నట్లు నువ్వెక్కడుంటున్నావన్నయా" అంది వర్ధని.

"చెంగల్పావు పేటలోనమ్మా. యిక్కడికి బాగా దూరం."

"ఒక్కడివీ ఎలా వుంటున్నావన్నయ్యా. దాంతోపాటు వండుకు తినటం."

"యేం చేస్తామమ్మా – కొద్దిరోజులు తప్పదు. అయినా రజనీకాంత్ వున్నంత వరకూ నాకు వంటరితనమేమిటిలే."

"ఎవరన్నయ్యా ఆయన – నీతోపాటే వుంటున్నారా."

"అవునమ్మా. నా పక్కగదిలోనే ఆయన వుంటున్నాడు. మొదట్లో నా పరిస్థితి తెల్సుకుని తన గదిలోనే వుండమన్నాడు. అప్పట్లో ఆయన ఆశ్రయంతప్ప వేరే గతి లేకపోయినా ఆ తర్వాత ఆర్థిక విలువల తేడా వల్లనైతేనేమి, స్వతంత్రంగా వుండాలన్న



భావనవల్లనైతేనేమి పక్కగదే ఖాళీ అయితే తీసుకున్నా – ఐతేనేం నన్నొక ప్రాణ స్నేహితుడిగా చూసుకుంటాడు."

"మరి నన్నెప్పుడు తీసుకెళ్తావన్నయ్యా నీ గదికి ?"

"ఎందుకమ్మా–నే నొచ్చానుగా"

"అదికాదు – మరి నీ దగ్గరో నాల్గు రోజులుండద్దేమిటి ?"

"అదా. నాదగ్గర నువ్వుండలేవమ్మా. ఇరుకు గది, పైగా బ్రహ్మచారి కొంప"

"ఫర్వాలేదన్నయ్యా – ఆ నాలుగు రోజులన్నా హాయిగా సర్దాగా వుండాలని..."

చెల్లెలి కళ్ళలోకి చూసి నవ్వి..."అయితే సరేనమ్మా – నాలుగు రోజులు పోయాక మామయ్య నడుగుతా. అయినా తాతయ్య ఒప్పుకోడే–"

"ఒప్పుకోపోతే మానేయమను. నే నొస్తానంతే" పట్టుబట్టింది.

"సరే! ఒప్పుకోకబోతే నాటకమాడేద్దాం" సంతోషంతో తలూపింది వర్ధని.

## 5

సాయంత్రం ఐదు దాటింది – చెట్ల ఆకుల సందుల్లోంచి పల్చని నీరెండ డాబా మీద పడుతోంది. తూర్పు నుండి వేడిని మింగుతూ ప్రవేశించి మనసుకు ఆహ్లాదాన్ని కలిగిస్తోంది చల్లగాలి. డాబామీద పిట్టగోడ కానుకుని ఆలోచిస్తూ ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూంది వర్ధని.

తనొచ్చి అప్పుడే నెల దాటిపోయింది. కాలగమనంలో నెల్లాళ్ళు ఓ విశేషం గాదు. కానీ తనకు నెల్లాళ్ళ లెక్కలోనిదే! ఇక్కడ కొచ్చి ఎన్నో చేయాలనుకుంది. కానీ యింకా మొదట్లోనే మిగిలిపోయింది. తన ఆశల శిఖరాల నందుకోడానికి పునాదులు నిర్మించుకోవాలి.

నెల్లాళ్లలో వర్ధని ఆ యింట్లో బాగా కలిసిపోయింది. విమల కూడ పరాయి పిల్లలా కాకుండా సొంత చెల్లెలి లాగే చూసుకుంటోంది. ఇక మహలక్ష్మమ్మగారి చాదస్తాలూ



















# మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాంది
# గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్న భాగం ఉంది





హనీ బీ బ్రాందీ చవిచూడండి

ఒక్క సారి ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి



## హనీ బీ
## బ్రాంది

**ఆ ఫ్రెంచి అనుభూతి కోసం!**

"మార్కెట్ చేయువారు హెర్బర్ట్ సన్స్ లిమిటెడ్"

"బాటిల్ చేయువారు మేక్‌డొవెల్ డిస్టిలరీస్"

# రాగవీచికలు

మాధవరావుగారి సాధింపులూ ఎక్కడున్నా ఒకటే.

"వదినా వదినా నీకో సంగతి చెప్పనా" మధు పరుగెత్తుకుంటూ వచ్చాడు—

"వూఁ చెప్పు—" అంటూ ఇటువైపుగా తిరిగింది.

"చెబితే యేమిస్తావ్"

"నా బొంద నేనేమిస్తానూ – యింతకీ అది నాకు సంబంధించిన విషయమా?"

"కాదులే- రేపు బాబాయి వస్తున్నాడు. బాబాయివస్తే రోజా కేడ్బరీ తెస్తాడు." అంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

బాబాయంటే ఆనందరావు మామయ్యన్నమాట! అందరూ చెప్పకోడమేగాని వర్దని ఎప్పుడూ చూడలేదు. ఎప్పుడో చిన్నప్పుడు చూసినా పెద్దగా గుర్తులేదు. అన్నయ్యకంటె యేడాదో రెండేళ్లో పెద్దట. రాత బాగుంది కాబట్టి యింకా యూనివర్శిటీలో చదువుతున్నాడు. "యిన్నాళ్ళూ తనకా ఆలోచనే రాలేదేం?" అనుకుంది.

* * *

ఉదయం ఎనిమిది గంటలు కావస్తున్నది స్నానంచేసి తన గదిలో కూర్చుని చిక్కు తీసుకుని జడ వేసుకుంటూంది వర్దని. అప్పటికే రాజశేఖరంగారు ఆఫీసుకు వెళ్ళిపోయారు. స్కూలుకు వెళ్ళే ప్రయత్నంలో మధు అటు తల్లినీ యిటు నాయనమ్మనీ తోచనీయకుండా చేస్తున్నాడు. నెమ్మదిగా టిఫిన్ కానిచ్చి బయటకు పోదామనుకుంటున్నారు మాధవరావుగారు.

యింటిముందు కారు ఆగిన చప్పుడైతే కిటికీగుండా వీధిలోకి చూసింది. వర్దని – టేక్సీదిగి, ఠీవిగా లోనికొస్తున్న వ్యక్తిపై పడిందామె దృష్టి. పొడుగ్గా ధృడంగా హిందీ సినిమా హీరోలా వున్నాడు ఆనందరావు. పూర్వమెప్పుడో చూసిన జ్ఞాపకాలన్నీ గుర్తు తెచ్చుకుని అతనే ఆనందరావన్న నిర్ణయానికొచ్చింది వర్దని.

క్షణంలో యింట్లో సందడి మొదలయ్యింది.

"యేరా టూర్ కంప్లీట్ అయినట్లేనా" మాధవరావుగారు.

"అయినట్లే నాన్నా. మీ రెప్పుడొచ్చారిక్కడికి? అమ్మ కులాసాయేనా" అంటూ లోనికి చూశాడు ఆనందరావు.

"యేమేవ్ మహలక్ష్మి ఆనందొచ్చాడు"

మాధవరావుగారి కేకకు తాపీగా హాల్లో కొచ్చి కొడుకును చూసి కుశల ప్రశ్నలు కురిపించి సంతృప్తిగా నిట్టూర్చింది మహలక్ష్మమ్మగారు.

"రావయ్యా ఆనందూ— వచ్చి స్నానం చెయ్యి టిఫిన్ చేద్దూగాని" అంది అప్పటికే హాల్లోకొచ్చి వాళ్ళసంభాషణ వింటున్న విమల.

ఆనందరావు లోపలికి నడిచాక హాలుకు కుడివైపు నున్న గదితెరిపించి పనిమనిషిచేత శుభ్రం చేయించి సామానంతా గదిలో పెట్టించింది విమల.

కొత్తదానిలా చూస్తూ దూరంగానే వుండిపోయింది వర్దని. ఆమె కిన్నాళ్ళూ ఆ గది మూసివున్న సంగతే గుర్తు రాలేదు. ఏమాత్రం ఆలోచించినా అది ఎవరిగదో తెల్సుకునేదే.

"నువ్వు కూడ రామ్మా వర్దనీ. టిఫిన్ చేద్దూగాని" విమల పిలుపుకు నుదుట తిలకం దిద్దుకుని వంటింట్లోకి వెళ్లబోయి చటుక్కున ఆగింది.

అట్నించి పొడుగాటి పువ్వుల టర్కీటవలు చుట్టుకుని గళ్ళలుంగీ భుజంమీద వేసుకుని వస్తున్నాడు ఆనందరావు.

వస్తున్న వాడల్లా ఆగి, "ఎవరూ? వర్దని కదూ? ఎంత పెద్దయిపోయింది" అన్నాడు ఆశ్చర్యంగా. సిగ్గుపడి తలొంచుకుని తలుపు చాటుకు నక్కింది వర్దని.

"నువ్వు చూడనంతమాత్రాన ఎదగకుండా వుండిపోతుందటోయ్." అంది విమల.

పరీక్షగా ఒకసారి వర్దనిని చూసి ఓచిరునవ్వు నవ్వి 'అంతాబాగున్నారా' అన్నాడు పలకరింపుగా.

'బాగానే వున్నారు' అన్నట్లుగా తలూపింది వర్దని.

వంటింట్లోనే ఆనందరావుకీ వర్దనికీ పీటలువేసి టిఫిన్ పెట్టింది విమల.

"ఆయన్ని తిననియ్యత్తయ్యా. నే తర్వాత తింటా" అంది వర్దని.

విమల ఆశ్చర్యంగా చూసి, "అదేమిటే పిల్లా. ఆనంద్ పైవాడాయేమిటి? అతనుంటే నీకేం. నీకు పెట్టింది నువ్వు తిను." అంది.

"యేవిఁటేవిటీ – నాకు. పెట్టింది కూడ తింటానంటోందా" అంటూ నవ్వుతూ వచ్చాడు ఆనందరావు. దించిన తల ఎత్తకుండా పీటమీద చతికిలబడింది వర్దని.

# దరికి పోలేని మరుగుదొడ్డి



## భారతదేశంలో, మరుగుదొడ్డి మలినమయిన పదం అలాంటి అవసరం లేదు.

నిజానికి చాల మంది వారి మరుగుదొడ్డిని అశుభ్రంగా ఉంచేస్తారు. ఇంత అశ్రద్ధ ఇంట్లో మరి ఏ చోటా ఉండదు. కను మరుగయిన చోటు అవటంతో మనకి దానిపై ధ్యాస ఉండదు. కాని చూడండి:

**శుభ్రతలేని మరుగుదొడ్డిని చూడలేం, వాసన భరించలేం. అది చాలా అనారోగ్యకరం. శాస్త్రవిరుద్ధం, తప్పని సరిగా హానికరం కూడా.**

ఇది మాత్రం ఏ మాత్రం హెచ్చు తగ్గులులేని పచ్చినిజం. కాబట్టి మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి...

**మీ మరుగుదొడ్డి మీకు నచ్చిన శుభ్రతతో ఉందా?**

దీనికి జవాబు తెలిసికొనవలసినవారు ఒక్కరే—మీరే మరి.

ప్రతి ఉదయం దానిని శుభ్రపరచటానికి పనివానిని నియమించినప్పటికీ, అతను చేయవలసినంత శుభ్రం చేస్తున్నాడా లేక ఆషామాషీగా చేసేస్తున్నాడా?

వీటికి మీకు సరియైన జవాబు లేకపోతే, చూడండి—ఆ జవాబు ఇదే మరి... స్యానిఫ్రెష్.

**స్యానిఫ్రెష్ అంటే ఏమిటి?**

స్యానిఫ్రెష్ మరుగుదొడ్డిని శుభ్రపరిచేది. అది మీ అసహ్యమయిన పనిని, మీకు చేసి పెడుతుంది. మొదట మరుగుదొడ్డిని ఫ్లష్ చేయండి. తరువాత స్యానిఫ్రెష్‌ను మరుగుదొడ్డి లోపల అంతా విరివిగా చల్లండి. 3-4 గంటలు అలా ఉంచండి. రాత్రి అంతా ఉంచితే మరీ మంచిది. తర్వాత తిరిగి ఫ్లష్ చెయ్యండి. ఫ్లష్ పని చేయని పక్షంలో బకెట్టుతో నిండుగా నీళ్ళని వదలండి. అంతే, మరి మీ శుభ్రం గురించిన సమస్య తీరిపోయినట్లే.

**స్యానిఫ్రెష్ 3 విధాలుగా పనిచేస్తుంది:**

**1. స్యానిఫ్రెష్ పరిపూర్ణంగా శుభ్రం చేస్తుంది.**

ఇందులో ఎటువంటి మరకలనయినా మటుమాయం చేసే చురుకైన అంశం ఉంది. బ్రష్‌కు అందని భాగాలను కూడా శుభ్రం చేస్తుంది.

**2. స్యానిఫ్రెష్ హానికరమైన క్రిములను సంహరిస్తుంది.**

మరుగుదొడ్డి క్రిములు పుట్టి పెరిగే చోటు, తద్వారా అనారోగ్యాలకు మూలం. వీటినుండి మామూలు ఫినాయిలు ఇవ్వలేని రక్షణను స్యానిఫ్రెష్ ఇస్తుంది. కాబట్టి మీరు మీ మరుగుదొడ్డియొక్క బాగు ఓగులను గురించి నిశ్చింతగా ఉండవచ్చు.

**3. స్యానిఫ్రెష్ చెడు వాసనలను నిర్మూలిస్తుంది.**

మరుగుదొడ్డి భరించరాని వాసన వేయవచ్చు. సరియైన గాలి ప్రసారం లేక, ఈ సమస్య ఇంకా ప్రబలిపోతుంది. స్యానిఫ్రెష్‌లో ఈ చెడు వాసనలను చెదరగొట్టి మంచి వాతావరణాన్ని చేసే డియాడరెంట్ ఉంది.

స్యానిఫ్రెష్‌ను ఎప్పుడు ఎన్నిసార్లు వాడుతూండాలి? దానికి జవాబు, మరుగుదొడ్డియొక్క శుభ్రతలోని ముఖ్యతను అనుసరించి, ఒకటే ఉంది, ప్రతి ఒక రోజూ.




మీ మరుగుదొడ్డిని శుభ్రంగా ఉంచటానికి, మీ అసహ్యమైన పనిని, మీకు చేసి పెడుతుంది.




బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 023.

CHAITRA-BLS-82 TEL

## రాగ వీచికలు

### 6

'వర్ధనీ – నువ్వు యింట్లో వుంటున్న ట్లేనా'' అని అడిగాడు ఆనందరావు ఎక్కడికో బయల్దేరుతూ. హాల్లో కూర్చున్న వర్ధనిని చూసి.

అవునన్నట్లు తలూపి లేచి నిల్చుంది వర్ధని.

ఆనందరావు గుమ్మం దాటాక సోఫాలో కూర్చోబోయేదల్లా వెనక్కు తిరిగి తన గదిలోకి వెళ్లి కిటికీ గుండా చూసింది. రోడ్డంట పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ పోతున్న ఆనందరావు చాల అందంగా కన్పించాడామె కళ్లకు.

ఆనందరావు వచ్చిన తర్వాత యీ పది రోజుల్లోనూ వర్ధనిని కలిసి ప్రత్యేకంగా మాట్లాడిందిలేదు. వర్ధని కూడ అతనెక్కడ ఎదురౌతాడనో తప్పించుకునే తిరిగేది. హాల్లో కూర్చోడం కూడ క్రమంగా తగ్గించేసింది – తరుచు ఆనందరావు గురించి ఎవరో ఒకరు వస్తూనే వుంటారు–అదీ ఒక కారణమే.

నాలుగు రోజుల క్రితమే చిన్న అల్లుడి దగ్గర నుంచి మాధవరావుగార్కి వుత్తరం వొచ్చింది, కూతుర్ని పురిటికి పంపిస్తున్నట్లు. అందుకే తిధివార వర్జ్యాలు చూసుకుని మాధవరావుగారూ మహాలక్ష్మమ్మగారూ తిరిగి వూరికి ప్రయాణం కట్టారు.

మాధవరావుగారు వర్ధని ప్రయాణం సంగతి ఎత్తలేదు. కానీ మహాలక్ష్మమ్మగారొక సారి కొడుకు దగ్గర కదిపింది. వర్ధనిని తీసుకుపోతే అక్కడ ఆసరాగా వుంటుందని ఆమె వూహ. కానీ రాజశేఖరంగారే మరోలా చెప్పి ప్రయాణం తప్పించారు.

పైగా యిక్కడ వర్ధని వుండటంవల్ల యింట్లో విమలకు నాల తీరిక దొరకటం ఆయన గమనించక పోలేదు. వంట, వడ్డన తప్పితే మిగతా పనంతా వర్ధనే చూసుకుంటూంది.

మధుని నిద్రలేపడం దగ్గరనుంచి బట్టలు తొడిగి స్కూలుకు పంపడం వరకూ ఆ పిల్లే చూసుకుంటోంది.

ప్రయాణానికి అన్ని యేర్పాట్లూ ఆనందరావే చేశాడు. మెయిల్లో రెండు బెర్తులు రిజర్వుచేయించాడు. రాజశేఖరంగారు ఆ పూట సెలవు పెట్టి యింట్లోనే వున్నారు. ప్రయాణానికని కాఫీ టిఫినూ, పళ్ళూ అన్నీ అమర్చి సిద్ధం చేసింది విమల.

వెళ్లేముందు మాధవరావుగారు వర్ధనిని చాటుగా పిల్చి ''చూడమ్మా వర్ధనీ నువ్వెప్పుడు రావాలనుకుంటే అప్పుడురా. నిర్బంధంలేదు. మీ అన్నయ్య కలిస్తే వీలు చూసుకుని ఏదో పరకో మీ అమ్మకి పంపిస్తూండమని చెప్పు'' అన్నారు.

అలాగే నన్నట్లు తలూపింది వర్ధని.

''మనిషి సాయం కావాల్సి వచ్చినపుడు రాస్తానురా అబ్బాయ్, వర్ధనిని పంపు'' అంది మహాలక్ష్మమ్మగారు కొడుకుతో.

'అలాగేలేమ్మా' అన్నారు రాజశేఖరంగారు.

''అక్కడంత మంది వుండగా తనొచ్చి యేం చేస్తుంది–'' అన్నాడు ఆనందరావు వూరుకోక.

ఆ మాట మహాలక్ష్మమ్మగారు విన్పించుకో లేదు. కానీ విమల సైగతో అతనే వూరు కున్నారు.

*  *  *

తాతయ్య, అమ్మమ్మ వెళ్లిపోవడంతో యింట్లో యేదో వెలితి యేర్పడ్డట్లనిపించింది వర్ధనికి. యేదో ఒకపని పురమాయించే వాడు తాతయ్య. తన కిష్టమైనట్లు చేయక పోతే సాధించేది అమ్మమ్మ. యేమైనా వారి ద్దరితోనూ సర్దుకు పోవడం నేర్చుకుంది. వాళ్ళు వెళ్ళిపోయారు.

ఎన్నాళ్ళయినా యిక్కడి వాతావరణం కొత్తదిలానే వుంది. తన ఆఫీసు గొడవలో తనుంటారు రాజశేఖరంగారు. ఏ టైము కొస్తారో ఎప్పుడు వెళతారో కూడ ఒక్కొక్కప్పుడు తెలియదు. ఖాళీగావున్నప్పుడు మాత్రం పలకరించి యేవో మాట్లాడతారాయన.

ఇక ఆనందరావు వున్నాడంటే తిండికి తప్ప యిల్లు జేరడు. ఎంతసేపూ యూనివర్శిటీ, ఫ్రెండ్సు, మీటింగులూ, ఇంటిపని ఆడవాళ్ళిద్దరూ చక చకా చేసుకు పోతే బోలెడంత తీరిక. కాస్సేపు కబుర్లు చెప్పుకున్నా, నిద్రపోయినా యింకా ఎంతో కాలం వృధాగా మిగిలిపోతూంది. ఇక ఆలోచనలే!

తాతయ్య అన్నమాటలే ఎప్పుడూ చెవుల్లో గింగురుమంటూ వుంటాయి. తన తండ్రి అంటే తాతయ్యకెందుకంత ద్వేషమో? అన్నయ్యపైన కూడ మంచి అభిప్రాయం లేదు -

వచ్చిన రోజు యేమన్నారు ?

'యేమన్నా వెనకేస్తున్నావురా. లేకపోతే మవ్వూ మీ నాన్నలాగేనా ?' అంటే ?

ఆయన దృష్టిలో డబ్బులేనివాడు పనికి మాలిన వాడిక్రింద జమ. వెళ్లేటప్పుడు మాత్రం తనతో ఆ చెప్పడమేమిటి ? అమ్మకి పదిరూపాయలైనా పంపుతూండరా అని తను అన్నయ్యకు చెప్పాలా ? వాడికి తెలీదూ? 'యేదో మీ కుటుంబ భారమంతా మా నెత్తినేసుకున్నా సుమా !' అన్న భావన కాకపోతే ఆ పది రూపాయలతో అక్కడ జరిగిపోయేదేమిటి ? యిక్కడ మిగిలిపోయేదేమిటి?

యేమైనాసరే! అమ్మనిక్కడికి రప్పిస్తేగాని పరిస్థితులు చక్కబడవు. అనుకుంది వర్ధని.

## 7

ఆ రోజు ఆదివారం. రాత్రి భోజనాల

## రాగవీచికలు

పైమెప్పుడు వర్ధనిని మెట్రిక్‌కి కట్టించాలనే వుద్దేశ్యాన్ని సలుగురిముందూ వుంచి ఆనంద రావుని అందుకుగాను ప్రయివేటు కోచింగ్ ఎక్కడ బాగుంటుందో కనుక్కోమని పురమాయించారు రాజశేఖరంగారు.

"ఎవరో ఎందుకూ ఆ మాత్రం మన ఆనందు చెప్పలేడేమిటి?" అని, "ఆ అమ్మాయేం తెలివి తక్కువది కాదు— యే విషయాన్నైనా త్వరగానే గ్రాస్ప్‌చేస్తుంది. అతనికీ ఖాళీ లేనపుడు నేనుండనే వున్నాను— ఇంగ్లీషు తప్ప మిగతావి నేను చెప్పగలను" తన అభిప్రాయాన్ని వ్యక్తపరచింది విమల.

"మనం చెప్పలేక కాదు విమలా. ఆసంగతి నేను ముందే ఆలోచించాను. యేదో తీరిక సమయాల్లో మనం చెప్పడం వేరు. క్రమ శిక్షణగా రోజూ కొంతటైంలో నేర్చుకోడం వేరు అందుకే అంటున్నాను. యేదీ కుదరకపోతే చివరికి నువ్వన్నట్లే చేద్దాం" అన్నారు రాజశేఖరంగారు.

రెండురోజులు తిరక్కుండానే ఆనందరావు ఆ విషయమై వివరాలు సేకరించి తీసుకొచ్చాడు.

మహిళా ట్యుటోరియల్ కాలేజీ అని కొత్తగా తెరిచిన ఓ కాలేజీ వుందట. రోజుకు రెండు షిఫ్టులు పెట్టి తరగతులను నిర్వహిస్తున్నారుట. అది కేవలం ఆడపిల్లలకే అయినా మాస్టర్లు మాత్రం చాల మట్టుకు మగవారే. అనుభవం కలవారే. రిటైరైన హెడ్‌మాస్టర్లూ, లెక్చరర్లూ కూడ వున్నారందులో.

ఆ విషయాన్నే అన్నగారికి చెబుతూ.

"మరో రెండు నెలల్లో ఆ ట్యుటోరియల్ కాలేజీ తెరుస్తారట అన్నయ్యా. పోతే రెండు షిఫ్టులు కాబట్టి యే టైం వీలుగావుంటుందో చూసుకుని మరీ చేరొచ్చు. ఈలోగా వర్ధని స్టాండర్డ్ యేమిటో తెల్సుకుని కొంత ట్రెయినింగిస్తే బావుంటుంది" అన్నాడు ఆనందరావు.

రాజశేఖరంగారందుకు ఒప్పుకున్నారు.

విమలకూడ తన అంగీకారాన్ని తెలియజేసింది. (ఇంకా వుంది)

## అవీ—ఇవీ—అన్నీ

### జ్యోతిక పెళ్లి : లౌక్యం తెలియని మనిషి

ప్రముఖ రచయిత్రి శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మి కలం నుండి జాలువారిన "జ్యోతిక పెళ్లి" "లౌక్యం తెలియని మనిషి అనే" రెండు నవలలు కూడా పాఠకులకు ఆరోగ్యకరమైన కాలక్షేపాన్నిచ్చే చక్కని నవలలు. వీటిని ఛాయా పబ్లికేషన్ వారు వెలువరించారు. ముఖచిత్రం శ్రీ బాపూ తీర్చిదిద్దిన, యీ నవలల్లో మొదటిది 8 రూపాయలు రెండవది కూడా 8 రూపాయలే. ప్రతులకు ఛాయా పబ్లికేషన్స్, ఏలూరురోడ్డు, విజయవాడ —2 కి వ్రాయాలి.

### అగ్గి చిగుళ్లు

కవితా సంకలనం, హైదరాబాద్ అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ, సంపాదకుడు శ్రీ ఎస్. వి. సత్యనారయణ, 68 పేజీలు వెల రెండు రూపాయలు. ప్రతులకు : హై. అ. ర. సం., మఖ్దూం మార్గ్, హైదరాబాద్—500021 విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2.

### స్టేట్ కారెక్టర్ యూత్ ఫోర్స్

యువతరం బాధ్యతాయుతమైన ప్రవర్తన కలిగి ఉంటేనే దేశం పురోగమిస్తుంది ఈ నాటి యువతీ యువకులపైనే దేశ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. నేటి యువతలో సత్ప్రవర్తనని క్రమశిక్షణని మెరుగుపరచడం ఎంతయినా అవసరం. ఈ అవసరాన్ని గుర్తించి నాలుగేళ్ల క్రితమే హైదరాబాదులో స్టేట్‌కారెక్టర్ యూత్ ఫోర్స్‌ని నెలకొల్పడం జరిగింది. ఇందులో ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఓబుల్‌రెడ్డి, విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. సంబశివరావు, న్యాయమూర్తులు, శ్రీ అల్లాడి కుప్పుస్వామి, ఎ. రఘువీర్ గార్లు ముఖ్యులు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు శ్రీ రావాడ సత్యనారాయణ అధ్యక్షులు శ్రీ ఎం. కృష్ణబాబు ప్రధాన కార్యదర్శి.

యూత్ ఫోర్స్‌లో నేటి యువతీ యువకులలో సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక ప్రవర్తనలని మెరుగుపరిచే కార్యక్రమాలు నిర్వహించారు. అన్ని రంగాలలోని ప్రముఖుల తోడ్పాటు దీనికి ఉంది. హైదరాబాదు, సికిందరాబాదు నగరాలకే పరిమితం కాక రాష్ట్రంలోని యితర ప్రాంతాలకి కూడా ఇది విస్తరించడం సంతోషకరమయిన విషయం.

ఎస్. సి. వై. ఎఫ్. నాలుగవ వార్షికోత్సవం సందర్భంగా వెలువరించిన సావనీర్ వివిధ రంగాలలో ప్రముఖులైనవారు రాసిన వ్యాసాలతో ఎంతో ఉపయోగకరంగా ఉంది. ఈ యూత్ ఫోర్స్‌కి సంబంధించిన అన్ని వివరాలనీ ఇందులో పొందుపరిచారు. ★

# వారఫలం

మహేష్

8-8 1975 శుక్రవారం మొదలు
14-8-1975 గురువారం వరకు

**మేషం :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం :—** మీ మంచితనమే మీకు ఇబ్బంది కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. సాహిత్య కళారంగాలల్లో ఖ్యాతి లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం :—** అనుకూలమయిన వార్తలను వింటారు. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో అనుకూలమయిన వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**సింహం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమయిన సమాచారం అందుతుంది.

**కన్య :—** ప్రయోజనం లేని శ్రమ కల్గుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాలల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**తుల :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం —** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో అనవసరమయిన శ్రమ కలుగుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసికవ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాలల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :—** ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలల్లో శ్రమ కలుగుతుంది. అనుకూలమయిన వార్తలను వింటారు.

**కుంభం:—** వృత్తిలో ముఖ్యమయిన వ్యక్తులను కలుసుకుంటారు. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం :—** సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ఇతరులతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయంచేస్తారు.

---

చేడుట. పెద్దదినం ఏర్పాట్లు కూడా బ్రహ్మాండంగా చేస్తాట్ట.

"పెద్ద కొడుకువి నువ్వు నీ చేత్తో వదిలిన ఉదకమే నీ తల్లికి ఉత్తమగతులు ప్రాప్తింపచేసేది." అనంటూ నాగయ్యకు శాస్త్ర విధులు విప్పిచెప్పిన పురోహితుడుగారే ఈ రోజున అన్న పేరెత్తకుండా తమ్ముడి చేత యధావిధిగా కర్మకాండలు జరిపిస్తున్నాడు.

తన తప్పులేకుండా చేసుకుందామని కాబోలు, "పెద్ద కొడుకు ముఖ్యమంటారు. అన్నయ్యని పిలిపిస్తాను." అని శేషయ్య నామకహా పురోహితుడితో అనబోతే లక్ష్మీకాంత చిచ్చుబుడ్డిలా లేచింది. "సొమ్ము నీదీ— షోకు నాదీ అని మధ్య ఆయన పెద్దరికమేమిటీ? వూరుకోండూరుకోండి" అని తోసి పారేసింది

పురోహితుడుకూడా ఆవిడ మాటలకి

## లోకం పోకడ

(11 వ పేజీ తరువాయి)

మద్దతిచ్చాడు. "కొడుకన్న తరవాత పెద్దేమిటి చిన్నేమిటి లేవయ్యా ! మీ అన్నయ్య వాలకం చూస్తే ఈ శాస్త్రాలమీద నమ్మకమున్నట్టు కనబడలేదు. అట్లాంటి వాడిచేత బలవంతాన కర్మచేయించితే దానిఫలం మీ అమ్మకందుతుందన్న నమ్మకం నాకులేదు." అని దంజం సవరించుకుంటూ పెదవి విరిచాడాయన. ఆ సమయంలో కాంతకి వంత పాడితే సంభావనలు అడక్కుండానే రెట్టింపు ముట్టుతాయి మరి.

ఆశించిన సమాధానాన్నే అందుకున్న శేషయ్య మరి ఆ ప్రస్తావన ఎత్తుకోలేదు. బయట పడడుగానీ ఈ దెబ్బతో వూళ్లో తమవైపు వీస్తున్న తిరస్కారపు వాయువులు తేలగొట్టాలని అట్టహాసంగా చేస్తున్న ఈ కర్మకాండ పథకంలో అన్నగారికి వాటా ఇవ్వటం నిజానికి శేషయ్యకి ఏమాత్రం ఇష్టం లేదు. లక్ష్మీకాంత సరేసరి. ఆగాలి ఏదో విధాన బావగారి వేపుగా సాగారితే మరీ సంతోషమామెకి.

అందుకనే అత్తగారి దినవారాలకి భర్త ఎంత డబ్బు వెదజల్లుతున్నా ఆటంకపెట్టడం లేదు. బావగారు కర్మ చెయ్యనన్నాడన్న సంగతి అడిగినవాళ్లకి సరే – అడగనివాళ్లకి కూడా పిలిచి చెబుతోంది. "ఆయన మనసు రాయిగాబట్టి మానగలిగేడు కానీ మాకు ప్రాణం ఒప్పలేదమ్మా" అంటూ తమ సులిమెత్తని గుణాల్ని ప్రదర్శిస్తోంది.

తల్లి చావు కాదుగానీ శేషయ్య ఇల్లు వారం రోజులపాటు పెళ్ళి వారిల్లులా కలకల్లాడిపోయింది.

మూడూళ్ల అవతలనించీ గరుడపురాణం చెప్పే శాస్త్రులుగారిని రప్పించాడు. ఆయన

పురాణం వినిపించే రెండు వేళల్లోనూ వూళ్ళో మూడువంతులజనం శేషయ్యగారి చావిట్లోనే వుండేవారు.

ఆ వారం రోజులూ శేషయ్యఇంట్లో గాడిపొయ్యలు మండుతూనే వున్నాయనీ, వూళ్ళో బీదాబిక్కి జనాలు పొయ్యలు రాజెయ్య లేదనీ అందరూ మహా విశేషంగా చెప్పుకున్నారు.

పదీ పదకొండూ చిన్నదినమూ పెద్దదినమూను: ముఖ్యమైన ఈరెండు రోజులూ మాత్రం పూరందరితోపాటు అన్నగారినీ ఆహ్వానించాడు శేషయ్య. నాలిక చివర్నించే ఆ పిలుపని తెలిసినా 'వాడితో నాకు శత్రుత్వమేమి'టనుకున్న నాగయ్య తమ్ముడింటికి వెళ్లటంమానలేదు.

## లోకం పోకడ

తల్లికి తానొక్కడే పుత్రుడన్నట్లు తమ్ముడు ఒక్కడే కర్మచేస్తూంటే పరాయి వాడిలా ఒకమూల నిశ్శబ్దంగా కూర్చుని చూస్తున్న నాగయ్యని ఎందరు ఎన్నిరకాలుగా అనుకున్నారో అతను వినలేదు; విన్నా పట్టించుకోలేదు.

కానీ ఆ ప్రలాపాల కోసమే కాచుకునున్న వాళ్ల వీనులకు విందులు చేశాయి. మనస్సు లానంద పరిపూర్ణాలయ్యాయి. ఆ వుత్సాహంలో దాతృత్వం అతిశయించింది శేషయ్యకి, లక్ష్మికాంతకీని.

భూదాన మిచ్చాడు; సువర్ణదానమిచ్చాడు; వస్త్రదాన మిచ్చేడు; 'నందినీదేవి'లాంటి గోవుని వత్సంతోపాటు, వెండి గిట్టలూ బంగారు కొమ్ములతోసహా సద్బ్రాహ్మడికి ధారపోశాడు.

'పొత్తర్లందుకున్న బ్రాహ్మణుల సంచులు నిండి పొర్లినాయి. దిట్టంగా సంభావనలందుకున్న బ్రాహ్మణుల ఆశీర్వచన పనసలతో ఇల్లు మారుమ్రోగింది.

కర్మకాండ యావత్తూ నిరాటంకంగా ముగిసింది.

వంటవారు ఆకులుపరిచి వడ్డనసాగించారు. నాలుగు పిండివంటలూ, నాలుగు కూరలూ, నాలుగు పచ్చళ్ళూ ఆకులు నిండుగా నోరూరిస్తున్నాయి. అందరూ భోజనాలకి ఆయత్తపడుతున్నారు. ఇక పిండాన్ని కాకులు ముట్టడమే తరవాయి.

చుట్టూరా చెట్లనిండా లెక్కలేనన్ని కాకులు. కానీ ఒక్కటీ పిండముంచిన ఆకుకేసి రావటంలేదు. ఎంత ప్రయత్నించినా అరిచి హంగామా చేస్తున్నాయే తప్ప లంచం చాలని ఆఫీసర్లలా ఎంతకీ చెట్టు దిగటంలేదు.

జనాన్ని చూసి బెదురుతున్నాయంటూ అందర్నీ లోపలికి నెట్టేశారు కొందరు. 'ఏం దోషం జరిగిందో తప్పు మన్నించమని దణ్ణాలు పెట్టండర్రా' అంటూ సలహా లిస్తున్నారు కొందరు; ఏమి కోరికలు మిగిలిపోయాయో అని అనుమాన పడుతున్నారు ఇంకొందరు; ఆవిడకిష్టమయిన వంటకాలేవో వండించి తెచ్చిపెట్టమని తొందర చేస్తున్నారు మరికొందరు.

ఏమిచేసినా, ఎన్నితిప్పలు పడినా ఆ వాయస రూపంలో ఉన్న పితృదేవతలు మాత్రం కరుణించలేదు.

# గొప్ప సంధానకారి

సర్‌సిల్క్. దృష్టినాకట్టే ఉత్తేజకరమైన ముదురు రంగులలో. చక్కని లేత రంగులలో. సాదా, చారలు మరియు గీతలలో.

సర్‌సిల్క్ నాణ్యమైన గుడ్డలలో మీరు కోరేవన్నీ సమకూర్చే సూటింగులు మరియు షర్టింగులు మీకు చేకూర్చ గలదు. మన్నిక గలవి. మంచి నాగరికతాభిరుచులకు దీటైనవి. వాడకానికి తేలిక. సరిగ్గా సక్రమమైన ధర.







ASP/SS/754



**సర్‌సిల్క్**
**పాలియస్టర్**
**సూటింగులు**
**మరియు షర్టింగులు**

సెల్లింగ్ ఏజంట్లు: ఆంధ్ర ప్రదేశ్: కలకత్తా మర్చంట్స్ & ఏజెంట్స్ (ప్రై) లిమిటెడ్, 11-41-51, కందుల వారి వీధి, విజయవాడ. తెలంగాణ: రుంగ్టా & కో. పథేర్ గట్టి, హైదరాబాదు. కర్ణాటక: మోడరన్ డీలర్స్ (ప్రై) లిమిటెడ్, కెంపెగౌడ రోడ్, బెంగుళూరు. తమిళనాడు & కేరళ: హిందుస్థాన్ డీలర్స్ లిమిటెడ్, 4, స్ట్రింగర్ స్ట్రీట్, మద్రాసు.

లోకంపోకడ * ఊమెన్













**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**

టైము గడిచిపోతున్నది. వేళ మించి పోతున్నది. ఏం చెయ్యాలో తోచని అయోమయంలో పడిపోయారంతా.

అప్పుడే ఎవరినోటంటనో సన్నగా ఊడిపడ్డదో మాట విసురు.

"ఆవిడకికిట్టనివాళ్లున్నారేమోఇక్కడ ?"

"ఎవరబ్బా వాళ్లు ?"

ఎంత తల్లయితే మాత్రం పిండమెయ్యని కొడుకంటే మనస్సు విరగదా ?"

"నాగయ్య సంగతా నువ్వనేది ?"

"ఏమోనబ్బా. నాకు తోచినదేదీ మనసులో ఉంచుకోలేను నేను. ఖర్మం."

అంతే. క్షణంలో ఈ అనుమానం లోగిలంతా అల్లుకుపోయింది. అదేం కోర్టు తీర్పా ? వాయిదాలు పడి నెలలు గడిచిపోటానికి ? అదే కారణమని వెంటనే నిర్ధారణగా నిర్ణయం గూడా అయిపోయింది.

ఎక్కడో ఒదిగి కూర్చున్న నాగయ్య అప్పటికప్పుడు అందరికళ్లకి రూపుకట్టిన శత్రువులా కనిపించాడు.

నాగయ్య మెల్లగా లేచాడు. తనకేసి పులుకూ పులుకూ చూస్తున్న లన్ని జతల కళ్ళనీ ఒక్కసారి తదేకంగా చూశాడు. కొన్ని నాళ్ళక్రితమే ఈ కళ్ల తాలూకు నోళ్లే తనని ఆకాశానికెత్తాయి. ఇప్పుడా పొగడ్తల తాలూకు ఛాయలు లవలేశమయినా కనిపించటంలేదు.

అతనికి వెర్రిగా నవ్వాలనిపించింది.

గిర్రున వెనక్కి తిరిగి తన ఇంటివేపుగా నడక సాగించాడు.

మబ్బుకమ్మిన ఆకాశంలో గ్రద్దలు గిరికీలు కొడుతున్నాయి. హోరుగాలికి వృక్షాలు శిరాలెత్తినట్టు తలలూపుతున్నాయి.

నాగయ్య భుజంమీది కండువా నిలవలేనట్టు కిందికి జారుతోంది. ఎదురుదెబ్బ తగిలి కాలివేలు చిట్లి రక్తం వస్తోంది.

నాగయ్య నడక ఆపలేదు; వంగి కాలయినా చూచుకోలేదు; సరాసరివెళ్లి ఇంటి తలుపులు తెరిచాడు. ఎదురుగా గోడకి రంగమ్మ ఫోటో వేలాడుతోంది. అంతవరకూ అణుచుకున్న ఆవేదన ఒక్కసారిగా పెల్లుబికింది.

'నిజం చెప్పమ్మా నేనంటే మనస్సు విరిగిందా నీకు ? దెబ్బతిన్న గుండె మూగగా చేసిన ఆర్తనాదమది.

ఫోటోలోంచి తల్లిచల్లగా నవ్వినఅనుభూతి. "చింతపడకు నాయనా! లోకం తీరది. దాన్ని లెక్కచెయ్యకు." తలనిమిరిన మృదువైన స్పర్శ. నాగయ్య సర్వం మరిచి పరవశించి పోయాడు. [అయిపోయింది]

# ధర్మపథం

## మానమూ చంద్రతారకం

వాగ్దానం చేసిన ప్రకారం పాండవులు వనవాసాజ్ఞాతవాసాలు పూర్తి చేసి వచ్చిన తర్వాత కౌరవులు పాండవుల రాజ్యాన్ని వారికీయవలసి ఉన్నది. కాని అది జరగలేదు. రాయబారాలు వ్యర్థమయినాయి. అందువల్ల భారతయుద్ధం తప్పనిసరి అయింది

కౌరవులు కర్ణుని బలంపైని, పాండవులు అర్జునుని బలంపైని ఆధారపడి ఉన్నారు. భగవానుడు శ్రీకృష్ణుడు పాండవుల పక్షం వహించి, అర్జునుని రథ సారథ్యం చేస్తూ, అతనికి ప్రోత్సాహమిచ్చాడు. కాని, యుద్ధరంగంమీదికి రాగానే అర్జునుడి ధైర్యం జారిపోయింది. తన బంధువులతోను, మిత్రులతోను యుద్ధంచేసి, వారిని సంహరించడానికి అతనికి మనస్కరించలేదు. తాను యుద్ధం చెయ్యననీ, రథాన్ని వెనకకు త్రిప్పి వెయ్యాలనీ అతడు భగవానుని అభ్యర్థించాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడికి ధైర్యం చెప్తూ, యుద్ధం చెయ్యడం క్షత్రియులకు ధర్మమనీ, స్వధర్మం నిర్వహించడం విధి అనీ, ఆ ధర్మ నిర్వహణంలో ప్రాణాలు పోయినా మేలే అనీ 'స్వధర్మే నిధనం శ్రేయః' అని బోధించాడు. యుద్ధంలో ఒకవేళ మరణమే సంభవిస్తే స్వర్గం లభిస్తుందనీ, విజయమే లభిస్తే రాజ్య సుఖాలను అనుభవించవచ్చుననీ 'హతో వా ప్రాప్స్యసే స్వర్గం జితో వా భోక్ష్యసే సుఖం' అని యుద్ధానికి ప్రోత్సహించాడు.

ముఖ్యమైన మరొక్కటి మానరక్షణ.

యుద్ధరంగం ప్రవేశించి – ఇంకా కొద్ది సేపటికి యుద్ధం ప్రారంభమవుతూ ఉండగా – శంఖ ధ్వానాలు మిన్నుముట్టిన సమయంలో "నేను యుద్ధం చెయ్యను; వెనుకకు పోదాం. నాకు రాజ్యంతో నిమిత్తం లేదు" అని చెప్పడం మానాన్ని చంపుకొని నిందలపాలు కావడమే అవుతుంది. ప్రాణం కంటె మానమే ఉత్తమం. అందులోనూ క్షత్రియునికి మానహాని తల కొట్టినట్లే కదా! తన మానాన్ని కాపాడుకొనుటకు అర్జునుడు యుద్ధం చెయ్యవలసినదే!

"ప్రాణానపి పరిత్యజ్య
మానమేవాభి రక్షతు,
ప్రాణాస్తరంగచపలాః
మానమాచంద్ర తారకమ్."

ప్రాణాలను విడిచిపెట్టి అయినా, మానాన్ని రక్షించుకోవలసి ఉంటుంది. ఏమంటే ప్రాణాలు తరంగాలవలెనే మిక్కిలి చంచలములైనవి–అనగా క్షణికములు. మానం మాత్రం చంద్రుడూ, నక్షత్రాలూ ఉన్నంతకాలమూ ఉంటుంది–అని దీని అభిప్రాయం

భగవద్గీత బోధించే ధర్మాలలో మానరక్షణ ఉత్తమ స్థానాన్ని ఆక్రమించి ఉన్నది.

–బులుసు వేంకట రమణయ్య

---

# ఉత్తరాలు

### తాటిముంజెలు !

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 11.7.75 సంచికలోని 'విశాఖ' రాసిన 'యుగసంధి' సీరియల్ కథలోని "క్రిస్ట్‌మస్' సెలవులకని రాఘవం తాతగారింటికి వచ్చాడు. సుందరాన్ని పొలానికి తీసుకు వెళ్లి వంటరిగా తాటిముంజెలు తింటూ మెల్లగా ప్రారంభించాడు" అని ఉంది.

కానీ, క్రిస్‌మస్ డిశంబరు 25, 26, 27 లలో వస్తుంది. తాటిముంజెలు, మే, జూన్ నెలలో మాత్రమే దొరుకును.

ఆర్. నారాయణస్వామి, ఎన్. రమేష్, (తిరుపతి.)

### విషయానుక్రమణికలో లేదు

అల్లాడూ –ఆటంకం (18.4.75) కథకి విషయానుక్రమణికలో పడడానికి కూడా ఏదో ఆషాడమాసపు ఆటంకం వచ్చినట్లుంది. కథల జాబితాలో ఈ "మళ్లీ వానాకాలపు" కథ పేరులేదు. ఇది మా "డిస్కవరీ".... ఎడిటర్‌గారు దీన్ని వేస్తారని ఆశిస్తున్నాం. . . .

పి. శ్యామల, జి. ఇందిర, (నైనవరం).

### ప్రశ్నావళి

11—7—75 పత్రికలో శ్రీనివాస్‌గారి చిత్ర విశేషాలు అద్భుతం. రామలక్ష్మిగారి జవాబులు హాట్ కేకుల్లా ఉన్నాయి. మంచి కథలు అందిస్తున్న మీకు మా కృతజ్ఞతలు. పత్రిక ఎప్పుడు ఇలా ఉండాలని ఆశిస్తాము.

పి. ఎస్. రమణ, ఎస్.. శివరాణి, ఎస్. నాగజ్యోతి కళ్యాణి, (యెల్లారెడ్డిగూడ.)

### కథలు

27—6—1975 నాటిసంచికలో పి. ఎం. సూర్యనారాయణగారు వ్రాసిన కథ "నీతి—ధర్మం" చదివిన తర్వాత ఈ లెటరు వ్రాయ లేకుండా ఉండలేకపోతున్నాను, ఇది వాస్తవానికి ఎంతో దగ్గరగా ఉన్నది వారికి ధన్యవాదాలు తెలుపకోరుచున్నాను. ఇక సామాన్యుని పణుగుడు ఇంత బాగా ఉన్నది ఉన్నట్లు తెలుపు చున్నది. ఆనందంగా ఉన్నది

ఆలహరి హేమచంద్, (రేపల్లె.)



### ముఖచిత్రం

హలం ముఖచిత్రంతో విడుదలయిన పత్రిక ఆకర్షణీయంగా ఉంది. కథలన్నీ బాగున్నాయి." "అర్థాలు వేరులె" చాలా బాగుంది భార్యల విషయంలో అపోహపడే భర్తలకు ఈ కథ చక్కని కనువిప్పు. ఈ కథ అందించిన భాగ్య లక్ష్మిగారికి నా కృతజ్ఞతలు.

ఎన్.కె. జ్ఞానదేవ్, (పూడిముడక)

11—7—75 సంచిక ముఖచిత్రం 'సంగీత' ఇదే వారం మరో పత్రిక (సచిత్ర వారపత్రికే) ముఖచిత్రం కూడా యిదే! ముందా పత్రికే వెలువడింది. అందమయిన ముఖచిత్రాలు వేసే మీరు కూడా ఇటువంటి పొరపాటు చేశారంటే నమ్మలేకున్నాము.

ఈ వారం నుండి ప్రారంభమైన "గాజు మేడ" సీరియల్ చాలా బాగుంది.

కె. రమేష్, కె. సునీల్, కె. రాధ, ఎ. శ్రీధర్, ఎ. రఘురాం, ఎ. జయరాం, పి. శోభన్ ఎస్.కుమార్. (ఎర్రగుంటపల్లి),

### సినిమా

గత వారము పత్రికలో మీరు వేసిన 'దో జసూస్' చిత్రానికి సంబంధించిన ఫొటో కింద రాజకపూర్, రాజేంద్రకుమార్ కలిసి ఒకే చిత్రంలో 'సంగం' తర్వాత నటించలేదని వ్రాసినారు కాని వారిద్దరూ కలిసి 'మేరా నామ్ జోకర్' చిత్రంలో నటించినారు.

ఎన్. త్రివిక్రమరావు, (గూడూరు)



రంజిత్ మూవీస్

# చీకటి వెలుగులు

ఈస్ట్‌మన్‌కలర్

కథ-దర్శకత్వం: కె.ఎస్. ప్రకాశరావు

నిర్మాత: కౌమూరి రంజిత్‌కుమార్

సంగీతం: చక్రవర్తి



హోల్‌డిస్ట్రిబ్యూటర్స్ లక్ష్మీకంబైన్స్

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

LAKSHMI PUBS